డిసెంబర్

విడుదల



వాహినీ వారి

# గుణసుందరి కథ



కె.వి. రెడ్డి, B.Sc.





| Poet | Camera | Sound | Art | Music |
|---|---|---|---|---|
| PINGALI NAGENDRARAO | BARTLEY | KRISHNAN | NAGESWARARAO | O. RAMACHANDRARAO |

*Produced at* VAUHINI STUDIOS

*Sole Distributors:*

**THE VAUHINI PICTURES Ltd.,**

MADRAS—VIJAYAWADA—TADPATRI.

*For Nizam State*: RAJSHRI PICTURES Ltd., SECUNDERABAD.

*For Mysore State*: TALLAM PICTURES CIRCUIT, BANGALORE CITY.

# వి ష య సూ చి క.






సంపాదకుఁడు

డాక్టరు. కే. యన్. కేసరి

సంపుటము ౧౮]    డిసెంబరు 1949    [సంచిక ౧౨




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైనప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయము మూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




జయజయ గృహలక్ష్మి సఖి జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయ కల్యాణీ !

# స్వతంత్ర భారత రిపబ్లిక్ రాజ్యాంగ చట్టం

26-11-49 నాటికి స్వతంత్రభారత రాజ్యాంగచట్టం తయారైనది. ఇది 26-1.50 నుండి అమలులోనికి రానున్నది.

ఇంత పెద్ద దేశం ఇంత శీఘ్రంగా ఇదివరలో ఎన్నడూ రాజ్యాంగచట్టం తయారుచేసి కొని ఉండలేదు. అయినా స్వాతంత్ర్యపిపాసులైన భారతీయ దేశభక్తులు ఆలశ్యమైందనే అంటున్నారు.

దాదాపు 3 సం॥ లు పట్టింది ఈ కార్యకలాపం. 11 సమావేశాలైనాయి. ఈ సమావేశాలు 165 రోజులు జరిగాయి. అందులో 114 రోజులు చిత్తుచట్టం ఆలోచించను గడిచింది. మొదట చిత్తుచట్టం, 315 నిబంధనలు, 8 షెడ్యూళ్లు. దీనికి 7635 సవరణలు పంపబడ్డాయి. వాటిలో 2473 ప్రత్యక్షంగా ప్రతిపాదింపబడ్డాయి. అందు కొన్ని అంగీకారమైనాయి. అందుచేత ఆసాంతమయ్యేసరికి సర్వాంగసుందరమైన రూపంలో ఆ చట్టం 395 నిబంధనలు, 8 షెడ్యూళ్లుగ తయారైనది. ఈసభ సమావేశాలను దర్శించడానికి వచ్చిన ప్రేక్షకులు 53,000 మంది. 22-11-49 నాటికైన వ్యయం రు 63,96,729 లు.

ఈ చట్టాన్నిగూర్చి పలువురు సభ్యులు, సభ్యేరాంధ్రు పల్కిన తుదివాక్యాలను వేరొకచో అచ్చొత్తినాము. దానినిబట్టి ఇది అందరికీ సంపూర్ణసమ్మతి అయిందనరాదు. అది ఎన్నటికీ సాధ్యంకాదుకూడా. ఎవరికోవకరికి ఏదోఒకలోపం కన్పించనే కన్పిస్తుంది. దైవనిర్మాణంలోనే లోపాలుంటున్నప్పుడు, మానవనిర్మితంలో లోపాలుండకపోతే అది అసహజం అవుతుందికూడా. అదీ రాజ్యాంగచట్టం అయినప్పుడు, అట్టిదాని నములు జరుపాలంటే, కొయ్యగుర్రాన్ని స్వారిచేయడమవుతుంది.

ముఖ్యంగా స్త్రీలు హర్షించదగినవి ఇందు రెండుమహాంశాలు. స్త్రీ, పురుషుల కుభయులకు ఈ చట్టంక్రింద సరిసమానత్వ మేర్పరుపబడ్డది. వయోజన వోటింగు హక్కు ఇవ్వబడినది. ఈ రెండున్నూ ఈ చట్టానికి ఉఛ్ఛ్వాస నిశ్వాసాలంటే అతిశయోక్తి కాదు.

జనాభాలో స్త్రీలు, పురుషులతోపాటు దాదాపు సమానసంఖ్య కలిగియున్నారు. ఈ రాజ్యాంగచట్టంలో ప్రభుత్వాధికారం ప్రజలకు సంపూర్ణంగా సంక్రమించియున్నది. కాబట్టి ఆ ప్రజలలో సగముమందికి (స్త్రీలకు) మిగతసగంమందితోబాటు సమాన ప్రతిపత్తిలేనిచో ఆ అధికారం అద్దంలో లిబ్బివంటి దవుతుంది. అట్లా సమానప్రతిపత్తిగల స్త్రీ, పురుషులు యావన్మంది తమకుగల రాజ్యాధికారమును పురస్కరించుకొని ప్రభుత్వ వర్గమును నిర్మించడానికి వీలులేకపోతే ఏకొలదిమంది ధనాఢ్యులకో, విద్యావంతులకో మాత్రమే ఆరాజ్యాగంలో వోటుచేసే హక్కు ఉంటే, పాచినోటి వానిభాగ్యం బంగారు నోటివాని భోగ్యం అవుతుంది. అలాంటప్పుడు ముఖ్యంగా వోటు హక్కు లేకుండా పోయే వారిలో స్త్రీలే విస్తార మవుతారు. ఏమంటే ఇంకావారికి ఆర్థిక స్వాతంత్ర్యం కలుగ లేదు; వారి విద్యావ్యాప్తి కూడా పూపప్రాయంలోనైనా లేదు. కాబట్టి వయోజన వోటింగు హక్కు స్త్రీపురుష సమాన ప్రతిపత్తిని అనుభవయోగ్య మొనర్చే సాధనమవుతున్నది.

ఇల్లలకగానే పండుగకాలేదు. ఈరెండు సక్రమంగా అమలు జరగాలంటే సామాన్య విషయముకాదు. భారతదేశం వంటి పెద్దదేశంలో వయోజన వోటింగు హక్కు అమలు జరుపడం-ఎంత బాహుళ్యమైన పనో గమనించండి. ఇప్పటిజనాభా ప్రకారం—16, 00, 00, 000 మంది ఓటర్లవుతారు. వీరందరిపేర్లు - తండ్రిపేర్లుసహా అచ్చొత్తాలంటే—(20/3½ అంగుళాల) ఫూల్‌స్కేప్ కాకితాలు—20,00,00 0 పట్టుతాయట; అంటే ఈకాకితాలను బొత్తుగా, అడ్డంగా నిలువబెట్టితే— 200 గజాలు పొడవవుతుంది. భారతదేశంలో ఉన్న అచ్చాఫీసులన్నీ పనిచేస్తే, ఇవి అచ్చయేసరికి 2 సంll లు పట్టవచ్చును; కాని కాకితం చాలుతుందా అన్నది సమస్య—అన్నారు రాష్ట్రపతి

పట్టాభిగారు. ఇక ఎన్నికలు చూతామా అంటే—రాష్ట్ర శాసన సభలకు, రిపబ్లిక్ యూనియన్ శాసన సభలకు కూడా ఎన్నికలు జరగాలి. ఇప్పటి అంచనా ప్రకారం రాష్ట్ర శాసన సభలకు సభ్యత్వ స్థానాలు సుమారు 3800; యూనియన్ పార్లమెంటుకు 500; మరి 250 స్టేటు కౌన్సిలు స్థానాలు. అమాంబాపతు 4500 స్థానాలు. సౌకర్యం కోసరం 4000 నియోజకవర్గాలైనా ఏర్పరచాలి. అంటే దామాషా మీద ఒక్కొక్క నియోజక వర్గానికి 4,00,000 వోటర్లు. ఎన్ని వోటింగ్ 'బూతులో', ఎందరు ఆఫీసర్లో, ఎందరు అభ్యర్థులో, ఎన్నివోట్లు పెట్టెలో, ఎంత ప్రచారమో, ఎంత గంధర్వ కోలాహలమో యోచించుకోండి!

ఈ గంధర్వకోలహాలంలో స్త్రీ,పురుషులు-విద్యావంతులు, వివేకులునైనా మతులు పోగొట్టుకోక, దేశభక్తిపూరితులై, స్వాతంత్ర్యోపాసకులై, ధర్మబుద్ధితో జగదీశ్వరుని ధ్యానించి, సకల భారత సంతానమునకు, అందుగల సకల స్థావరజంగమములకు, యోగక్షేమము నాశించి, తమ వోటును వినియోగించ గలిగితే, పైరెండు హక్కులూ సంపూర్ణంగా, సక్రమంగా వినియోగం అవుతాయి. అప్పుడీచట్టంయొక్క ప్రయోజనం సంపూర్ణంగా భారతీయప్రజకు చేకూరుతుంది. అప్పుడే భారతదేశంలో నిత్యకళ్యాణము, పచ్చతోరణము. కాని నాడు - ఈచట్టం వట్టి చిత్తుకాకితాల కట్ట!

## ఆంధ్రరాష్ట్రసిద్ధి

ఆంధ్రరాష్ట్రసిద్ధి అనుకున్నట్లు 26-1-50 నాటికి చేకూరేట్లుకన్పించదు. 1-4-50 కైనా అవుతుందనే ఆశమాత్రం విడవడంలేదు. ఏమైనా కేంద్ర ప్రభుత్వం వారున్నూ హైకమాండు వారున్నూ, సాధ్యమైనంత శీఘ్రకాలంలో ఆంధ్రరాష్ట్రాన్ని యేర్పరచవలెనని ఆమోదించారు. తమప్రయోజనాలను సంపూర్ణంగా సంరక్షించుకొంటూ అచిర కాలంలోనే ఆంధ్రులను విడిపోనివ్వాలనే ఔదార్యమును తమిళులు చూపుతున్నారు. పట్టువిడుపు మెళుకువలతో - ఆంధ్రరాష్ట్రాన్ని సాధించి కళ్ళచూతామనే ఆత్రం ఆంధ్ర నాయకుల కేర్పడుతున్నది. మద్రాసు మంత్రివర్గం వారేర్పరచిన విభజన సంఘంలో ఆంధ్రకేసరి ప్రకాశంపంతులు, కళావెంకట్రావుగార్లు ఉభయులూ ఉండడం లాభకరం; క్షేమకరం. వీరి నిర్ణయాలు న్యాయంగాను ఉంటాయి. ఆంధ్రదేశంలో వ్యతిరేకత ఉండదు. ఈసమయంలో ఇతర ఆంధ్ర నాయకులు, ఆంధ్రపత్రికలు, తలవిరియ పోసుకొని శివాలాడడం విరమించి కమిటీవారికి నిర్మాణాత్మకము, వివేకయుతమునైన సూచనల నందిస్తూ వారికార్యం శీఘ్రంగా ముగియడానికి తోడ్పడడం అవసరమని హెచ్చరిస్తూ ముఖ్యంగా ఈకమిటీ వారు పిదప మద్రాసు ఎవరిదైనా అందలి వివిధ భాషలవారి భాషాప్రయోజనములు సంస్కృతి ప్రయోజనములు భంగపడకుండే సాధన చూడదగునని కోరుచున్నాము.

# స్వతంత్ర భారత రిపబ్లిక్ రాజ్యాంగ చట్టం

**భారత రాజ్యాంగచట్ట సభవారు మూడవసారి చిత్తుముసాయిదాను పరిష్కారంగా యోచించినప్పుడు ప్రముఖులైన సభ్యులు వెలిబుచ్చిన అభిప్రాయాలు:**

---

### బేగం అయిజాజ్ రసూల్

ఈ చట్టములో భారతీయుల ఆశలు, ఆశయాలు ఇమడ్చబడినాయి. ఇందులోఉన్న గొప్ప విశేషమేమనగా దీనివల్ల ఏర్పడేది కేవలం లౌకిక రాజ్యము. మైనారిటీల లిపి, సంస్కృతి సంరక్షింపబడినది. న్యాయంగా కోరినచోట్లనెల్లా మాతృభాషలో ప్రాథమికవిద్య బోధింపబడునని ఆశిస్తున్నాను. జీవితముయొక్క అన్నిరంగములలోను, అన్నివృత్తులలోను స్త్రీలు పురుషులతోపాటు సరిసమానముగ ప్రవేశించి తమ అర్హస్థానమును పొందుట కిందు అవకాశమివ్వబడినది. మరొక్క విశేషమేమనగా - శాసన సభ్యత్వములు కొన్ని స్త్రీలకు ప్రత్యేకించడమనేది విరమింపబడినది.

### శ్రీమతి హన్సా మెహతాసతి

ఈ చట్టం మంచిచెడ్డలు - అది ఎలా అమలు జరుగుతుంది; ఓటర్లు ఎలాంటి ప్రతినిధులను ఎన్నుకొంటారు-అనేదానిమీద ఆధారపడి యుంటుంది. ఒక వైపు 'గోసంరక్షణవాది' సేఠ్ గోవిందదాసున్నూ, మరోవైపు అట్టడుగున పడియున్న వాని నుద్ధరించవలెననే కే. టి. షాయున్నూలాగగా - ఇది ఈ రూపాన తయారైనది. మనదేశంలో పలుప్రాంతాల ఇంకా అమలులోఉన్న - అసహ్యకరమగు ఘోషాపద్ధతి నిషేధించవలయునని మావంటివారము కోరాము; కాని అలాంటి సంగతులు ప్రస్తావిస్తే మతపాషండులు కొందరు చకితులవుతారని వద్దన్నారు.

### శ్రీ మొసలికంటి తిరుమలరావుగారు

వయోజన ఓటింగుహక్కు ప్రవేశపెట్టడాన్నిగూర్చి నాకంత ఉత్సాహకరంగా లేదు. ఓటర్లు సరియైన విద్యావంతులు, ఉత్తమ దేశభక్తులు కానిచో అది ప్రమాదకరము కాగలదు. గాంధీ ఉద్యమము ఊరక గ్రామాల దరిదాపులకు మాత్రమే పోయింది; మధ్యతరగతి విద్యావంతులకు మాత్రమే అది బోధపడ్డది. వయోజన వోటింగుహక్కు రెండు వైపులా పదునుగలకత్తి; క్రమంగా పదిసంవత్సరాలలో సావకాశంగా ప్రవేశపెట్టేటట్లైతే బాగుండును.

### శ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యగారు

ఈ చట్టము - అమెరికా సంయుక్త రాష్ట్రముసహా - కొన్ని ఫెడరల్ రాజ్యాంగ చట్టాలకన్నా కొన్ని విషయాలలో ముందడుగు వేయుచున్నది. ఈ రాజ్యాంగచట్టం బిర్రబిగుసుకొనిలేదు; అవసరమైన విస్తరణకు అవకాశమిస్తున్నది; అభివృద్ధి కనుకరించే బీజములిందిమిడియున్నది. దీని సేయొక్కవిధమైన ఆర్థికవిధానానికి గుదిగుచ్చలేదు; ప్రజలు తమ ఇష్టానుసారంగా ఆర్థిక పునర్నిర్మాణము గావించుకోవచ్చు. దేశంలో అక్షరజ్ఞానంలేనివారు, ఏమితెలియనివారు పలువురున్నా సాహసించి వయోజన వోటింగుహక్కు ఏర్పరచబడినది; ప్రజాసామాన్యమునందుగల అత్యంత విశ్వాసము, ప్రజాప్రాతినిధ్య పరిపాలన ఎలాగైనా తుదనెగ్గుననే ధైర్యము, అట్టిప్రజాపాలనవల్ల ప్రజలకు సుఖసౌఖ్యములు చేకూరుననే నమ్మకము ఇవే ఆ సాహసానికి కారణాలు. ఓటు హక్కునకు విద్యార్హతగాని, ఆస్తి అర్హతగాని ఏర్పరచిఉంటే ఎంతోమంది కార్మికులు, స్త్రీలు ఓట్లులేనివారై పోదురు. అది ప్రజాప్రాతినిధ్య సూత్రానికే భంగకరము. ఇందులో కామన్‌వెల్తుతో భారతదేశానికిగల సంబంధాన్నిగూర్చి ఒక్కముక్క లేదు.

## డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు

ఈ రాజ్యాంగచట్ట రూపేణా గాంధీ బోధించిన సూత్రాలను ప్రత్యక్షంగా సాధించాము. దీని నిర్మాణమునకల్గిన ఆలశ్యంచేత బ్రిటిష్ ప్రభుత్వంనుంచి మనకుసంక్రమించిన అనేక అపభ్రంశాలను తొలిగించుకోగలిగాము. ఈ చట్టం విప్లవాత్మకంకాదని 1935 సం॥ చట్టానికి అనుసరణమనీ అంటున్నారు కొందరు. మనము రక్తప్రవాహాలలో యీది స్వాతంత్ర్యం సాధించలేదు; అధికారవర్గ ధూర్వహమైన (Bureaucracy) రాజ్యాంగమునుండి - సహకారపరపతి సమాఖ్యరూపక (Cooperative common- wealth) రాజ్యాంగమునకు పరివర్తనము చెందుచున్నాము. దానిని గమనింపదగును. విప్లవాలకున్నూ, దస్తావేజులకున్నూ పరస్పర వైరుధ్యంకలదు. రాజ్యాంగ చట్టంఅంటే - రాజకీయసూత్రాలతో కూడిన వ్యాకరణశాస్త్రంలాంటిది. దానంతటది నిర్జీవము, చైతన్యరహితము. దానిని ఉపయోగించేవాళ్లగు మనస్తత్వమునుబట్టి అది ఉపయోగకారి. రంగులు, కుంచలు అందరికీ ఒకటే. అయితే వానిని ఉపయోగించేపద్ధతినిబట్టి అనేకరకాల బొమ్మలు తయారవుతున్నాయి. ప్రారంభదశకు ఇది చాలామంచి రాజ్యాంగచట్టము. దాన్ని సంపూర్ణంగా వినియోగించుకొని దానిలో సారమంతా పిండుకోవాలి. ఆత్మరక్షణార్థమే మనం ప్రజాసామాన్యాన్ని విద్యావంతులను గావించాలి.

## శ్రీమతి పూర్ణిమా బానర్జీ గారు

ఆధునికసంఘానికి కావలసిన అవసరాలను అత్యల్పంగానే ఈచట్టంలో అవకాశమేర్పరుపబడినది. కొన్ని ఉద్యోగాలు, పదవులు 'సంపాదింతామని కాదు భారతీయులు స్వాతంత్ర్యపోరాటం సాగించినది; సంఘాన్ని పునర్నిర్మాణంగావించి, నలిగిపోతున్న సామాన్యప్రజ దారిద్ర్యము తొలిగింతామనిగాని-ఇందులో ముఖ్యభాగము ప్రజలకుగల ప్రాథమిక హక్కులనిర్ణయము, ఇందు ఉప్పపన్నురద్దును తొలిగించడం విషాదకరం. దానికొక చరిత్రఉన్నదిగదా!

## శ్రీమతి దుర్గాబాయిగారు

ఇది ఎత్తుకొత్తు ప్రజల రాజ్యాంగచట్టము. దీనిమూలాన ప్రజాసామాన్యముయొక్క ఇష్టప్రకారం రాజ్యం జరుగుతుంది. ఇది సోషలిస్టు రాజ్యాంగము కాదు; కమ్యూనిస్టు కాదు; పంచాయితీ పద్ధతిపై ఆధారపడ్డదీ కాదు. అందుచేత ప్రజలు తమ ఇష్టమువచ్చినరూపం దీనికిచ్చుకోవచ్చు. ఇందులో పొందుపరుపబడిన ప్రాథమికహక్కులు-గాంధీసూత్రము ననుసరింపబడునని తెలుపుచున్నవి. రాగల శాసనసభలలో ప్రతినిధులు తమ పదవులను తమకు సంక్రమించిన ఆధిక్యతగా నెంచక అదియొక్క విధ్యుక్తధర్మముగాను, బాధ్యతగాను భావింపవలసియున్నది.

## శ్రీమతి అమ్ముస్వామినాధన్ గారు

40 కోట్ల ప్రజలు ఇన్నాళ్లు కలలుగన్నది ఈ రూపాన నిజమైనది. కాకితంమీద వ్రాసియుంచిన ఆదర్శాలను, ప్రజాసౌకర్యార్థమై ఆచరణలోనికి తీసుకొనిరావడం ఇక ప్రజానాయకులపైనున్నది. ప్రాథమిక హక్కులు, విధానముల సూచిక అనే రెంటిమీద ఆధారపడిన ఈరాజ్యాంగ చట్టాన్ని సరిగా అమలుజరిపితే దేశంలో నిజమైన ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వం ఏర్పడుతుంది. ఈ చట్టంలో స్త్రీపురుషులు సరిసమానమని నిర్ణయించినట్లు భారతదేశం ప్రపంచానికి చాటిచెప్పవచ్చు. ఈ అవకాశంవల్ల దేశీయవ్యవహారాలలో స్త్రీలు తమ కర్తవ్యమైన బాధ్యత వహింపవచ్చు.

## మౌలానా హజరత్ మొహానీ

సవరణలను ప్రతిపాదించడానికి వీలులేకుండా జరుపబడే ఈ చర్చ కేవలం ప్రహసనం (అధ్యక్షుని ఆజ్ఞపై ప్రహసన మనేమాట ఉపసంహరింప బడినది.) నే నీబిల్లుకంతా వ్యతిరేకిని.

## శేఠ్ గోవిందదాస్

ఈచట్టము ఇంగ్లీషులో తయారుచేసి మనం తీర్మానించడం ఇంకా మిగిలియున్న 'బానిసత్వచిహ్నం'గా భవిష్యత్ చరిత్రకారులు భావిస్తారు.

## ప్రొ. కె. టి. షా.

ఈ చట్టంలో ఆచరణయోగ్యమైన ప్రజాప్రభుత్వవిధానము పొందుపరుపబడలేదు; ఇది ఫాసిజముకు కూడా దారితీయవచ్చును. బ్రిటిష్ కామన్‌వెల్తులో సభ్యత్వ మున్నంతకాలము భారతదేశానికి సంపూర్ణ స్వతంత్ర ప్రభుత్వాధికారం ఫలాయించడానికి వీలుండదు. దీనిలో అనేకలోపా లున్నాయని దీనిని తిరస్కరించమనను. దీనిని న్యాయంగా అచరణలో పెట్టితే 5 లేక 10 సం॥లలో నిజమైన ప్రజాప్రభుత్వాన్ని ఏర్పరచను వీలవుతుంది.

## ఆచార్యరంగా

ఈ సభాసభ్యులు మన అధ్యక్షుడు, మన నాయకాగ్రేసరులు నెహ్రూపటేల్లు ఆశీర్వదింపగా క్రొత్త ఆంధ్రరాష్ట్రమేర్పడనున్నదిగాన, ఇది స్మరణీయదినము. అనేకవిధముల ఈసభ ప్రపంచానికి మార్గదర్శకమైనది.

## శ్రీమతి అన్నీ మేస్కారీనికన్య

ప్రజాసత్తాకముయొక్క గంభీరమగు సుందరశిఖరమే ఈరాజ్యాంగచట్టము. ఇందిమడ్చబడిన స్వాతంత్ర్యము, సమత్వము, సుహృద్భావము - మాచెవులకు మత్తెక్కించే సంగీతమువలె ఉన్నది.

## యస్. వి. గడ్గిల్

ఈ చట్టంలో లోపాలు లేవనను. కాని, 'విశ్వామిత్రుని' వలె నిరాకరించను. దీనిని జాగ్రత్తగా అమలుజరిపితే, - ఉపోద్ఘాతంలో చెప్పబడిన ఆర్థికసాంఘికమైన ఆదర్శాలను సాధించవచ్చు.

## శ్రీమాన్ అనంతశయనం అయ్యంగారు

దీన్ని తయారుచేయను 3 సం॥లు పట్టిందే అని కొందరంటారు. 15-8-47 వరకు ఇతరకారణమువల్ల మనపని కొనసాగలేదు. భారతదేశైకీకరణము, స్వదేశసంస్థానముల సమీకరణము, మైనారిటీ సమస్యా పరిష్కారము, ప్రత్యేకప్రాతినిధ్యమును, స్థానముల ప్రత్యేకత రద్దుపరచడము, కేంద్రమునకు, రాష్ట్రమునకు పరిపాలనాశాఖలనుపంచడం, ఆ ఉభయముమధ్య ఆర్థికవిభాగము, ఆస్తివశం చేసుకొంటే ఇవ్వవలసినముదరా నిర్ణయము, యూనియన్ రాజ్యభాషానిర్ణయం - ఇవన్నీ కొన్నినెలలు కాదుగదా సంవత్సరాలు పట్టేపనులు; అయితే వీటన్నిటిని సమరసంగ పరిష్కరించాము.

## దామోదర స్వరూప శేఠ్ (సోషలిస్టు)

ప్రజాసామాన్యము ఆశలన్నీ ఈచట్టంలో మట్టిగొట్టుకపోయినవి. ఈ చట్టం - యూనిటరీ విధానము కలది. ఇది క్రమంగా 'ఫాసిస్టు నియంతృత్వానికి' దారితీస్తుంది. ప్రజాభిప్రాయం తీసుకుంటే వారు దీన్ని నిరాకరిస్తారు. కూలివానికి 'చాలినంత కూలి' చూపేవాక్యంమేమీ ఇందులేదు. 'పేదవారికి బాధపడేవారికి, ఆకలిగొన్నవారికి' ఈచట్టంలో ఆధారం ఏమీలేదు. వారికి సంబంధించినంతవరకు ఇది - చిత్తుకాకితం. కావుననే రాజకీయ ఛాందసులకు, పెట్టుబడిదార్లకు ఈచట్టం స్వర్గతుల్యమైనది.

## ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారు

ఈచట్టం ఈరూపంలో తయారు అవుతుందని నేననుకోలేదు. మహాత్మాగాంధీ ప్రతిపాదించిన పంచాయితీరాజ్యవిధానంమీద ఇది ఆధారపడి ఉంటుందనుకున్నాను. అట్లాంటిచట్టమే - బ్రిటిష్‌వాండ్లచేత, ఇప్పుడు మనవాళ్లచేతకూడ నిరాదరింపబడుతున్న కోట్లాది జనసామాన్యానికి తిండి బట్ట కలుగజేస్తుంది. ఆంధ్ర రాష్ట్రము నేర్పరుప తీర్మానించినందుకు పటేలునెహ్రూలను కాంగ్రెసు వర్కింగుకమిటీని అభినందిస్తున్నాను.

## శ్రీమతి రేణుకరాయ్

ఇది కొంతలోపభూయిష్టమైనదైనా మన ఆశయముల నెరవేర్చగలదే. మనరాజకీయహక్కులను ప్రాథమికహక్కులలో చేర్చారు; ఆర్థికహక్కులను సూచికలోచేర్చారు. కాలక్రమమున దేశంలో "గాంధీ తత్వానుసారం సోషలిజం" స్థాపింపబడునని ఆశిస్తున్నాను.

## డాక్టర్ అంబేద్కర్

తే 26-1-50న రాజకీయంగా మనప్రజకు సర్వసమానప్రతిపత్తి కలుగుతుంది; ఆర్థికంగా సాంఘికంగా హెచ్చుతగ్గులలాగే ఉంటాయి. సాధ్యమైనంత త్వరలో ఈవైరుధ్యమును తొలగించవలె; లేకపోతే, ఆ హెచ్చుతగ్గులవల్ల బాధపడేవారే- ఆరాజకీయ ప్రజాప్రభుత్వాధికారాన్ని ఛిన్నాభిన్నంగా ఎగరకొట్టేస్తారు.

26-1-50 న భారతదేశం స్వతంత్రరాజ్యం అవుతుంది. ఆ స్వాతంత్ర్యం స్థిరంగాఉంటుందా - ఊడదుతుందా? నన్ను కలవరపెట్టేదేమంటే - కొందరు భారతీయులు ద్రోహంచేయుటచేతనే ఇదివరలో మన స్వాతంత్ర్యం నశించినది. మహమ్మద్ బిన్‌కాశిం సింధుప్రాంతములపై దండెత్తినప్పుడు - ధార్ రాజు సేనానులు కాశింవద్ద లంచాలుతీసుకొని యుద్ధంచేయ నిరాకరించారు. పృథ్వీరాజుమీదికి దండెత్తివస్తే తాను సోలంక్ రాజులు సహాయంచేస్తామని మహమ్మద్ గోరీ నాహ్వానించినది జయచంద్. శివాజీమహరాజ్ హిందువుల స్వాతంత్ర్యార్థమై పోరాడగా కొందరు మహారాష్ట్రప్రభువులు, రాజపుత్రులు మొగలాయిల పక్షాన యుద్ధంచేశారు. బ్రిటిష్‌వాళ్లు శిఖులను నాశనంచేస్తుంటే వారి సేనాని గులాబ్‌సింగ్ సిఖురాజ్యాన్ని రక్షించక మెదలకుండా కూర్చున్నాడు. 1857 స్వాతంత్ర్యసమరంలో సిఖులు తమకు కానట్లుచూస్తూ ఊరకున్నారు. చరిత్ర తిరిగి చర్వితచర్వణ మవుతుందా అని నాదిగులు. భారతీయులు తమ కులమతసంబంధాలకన్నా దేశం హెచ్చని భావిస్తారా? మన స్వాతంత్ర్యాన్ని ఆఖరు రక్తపుబిందువువరకు వోడ్చియైనా సంరక్షించుకోవాలి.

ఇంకా మన స్వాతంత్ర్యం సంరక్షింపబడవలెనంటే - మన ప్రయోజనాలను సాధించడానికి చట్టసమ్మతమైన పనుల నాశ్రయించాలి. అంటే - దారుణమైన విప్లవమార్గాలను విడవాలి. అనగా శాసనోల్లంఘనం, సత్యాగ్రహం, సహాయనిరాకరణం - అనేమాటలు మరవాలి. చట్టసమ్మతమైన పద్ధతుల కవకాశం లేనప్పుడు - చట్టవిరుద్ధమైనపనులకు పూనుకున్నాము. ఆ పద్ధతులు అరాచకానికి ముఖ్యసూత్రాలు. బాగుపడవలెనంటే వానిని వదలిపెట్టాలి.

మరోహంశమూ ఉన్నది. మనస్వాతంత్ర్యాలను భక్తిభావంతో వ్యక్తులకు బలియివ్వరాదు. ఐర్లాండు దేశభక్తుడు ఓ కన్నెల్ ఇట్లన్నాడు:

> "ఏ స్త్రీకూడా తన శీలాన్నిసహా బలిఇచ్చేంత కృతజ్ఞత చూపదు.
> ఏ దేశమున్నూ - తన స్వాతంత్ర్యాన్ని బలియిచ్చేటంత కృతజ్ఞత చూపజాలదు."

వీరపూజ సైజమైన భారతీయు లీ విషయంలో జాగ్రత్తగాఉండాలి.

## బ.బూ రాజేంద్రప్రసాద్

32 కోట్లజనానికి రాజ్యాంగచట్టం ఏర్పరచడనే ఘనమైనకార్యాన్ని నెరవేర్చినందుకు సభ్యులగు మిమ్ములను అభినందిస్తున్నాను. క్రొత్తవోటర్లలో అధికసంఖ్యాకులగు గ్రామప్రజలయందు నాకు సంపూర్ణమైన విశ్వాసమున్నది. వారికి వివేకమున్నది; ప్రాపంచికజ్ఞానమున్నది; వారికొక విధమైన సంస్కృతికూడా ఉన్నది - అది కుతర్కవాదులైన నాగరికులకు నచ్చకపోవచ్చుగాని అది ఘనమైనది, స్థిరమైనది. మొత్తము మీద భారతదేశానికి బాగా ఉపకరించే రాజ్యాంగచట్టాన్నే తయారుచేశారు. నాకు రెండేకొరవలు: శాసనసభ్యులకు అర్హతలు నిర్ణయించలేదని ఒకటి; స్వతంత్రభారతదేశపు రాజ్యాంగచట్టము భారతీయ భాషలో వ్రాయబడలేదని రెండు. చట్టంలో ఏం ఉండనీ, ఏం ఉండకపోనీ దానివల్ల దేశానికి కల్గే బాగోగులు ఆదేశం పరిపాలింపబడే పద్ధతిమీద ఆధారపడిఉంటుంది. భారతదేశపు యోగక్షేమాలే తమదృష్టిలో ఉంచుకొని వ్యవహరించే న్యాయబుద్ధిగల స్త్రీపురుషులే నేడు భారతదేశానికి కావలసినది. మహాత్మాగాంధీబోధనలను మరువకండి. విశ్వాసముతో, సత్యముతో, అహింసతో, అన్నిటికిమించి హృదయపూర్వకముగా ఈశ్వరుని ముఖముచూచి - మన స్వతంత్రరిపబ్లిక్ ప్రభుత్వమును సాగించుటకు ఈనూతన రాజ్యాంగచట్టము నమలు జరుపుదుముగాక.





ఇది ఒకరకం—"కుక్కర్" (వంటచేసే సాధనం). దీనిలో ఒకేసారి పలుసాధకములను వండవచ్చు. ఉడికేటప్పుడుపొంగి ఒక పదార్థములో ఇంకోటి కలియదు; ఒకదాని వాసన ఇంకోదానికి పట్టడంకూడా ఉండదు. దీనికి స్టీమ్ సెగ నుపయోగిస్తారు. ఇందులో 40 మందికి సరిపోయే పదార్థం వండడానికి — రు. 0-4-0 శగ ఖర్చవుతుంది. ధర ఎంతో తెలీదు.

*

# త్యాగి

## శ్రీమతి గుడిపాటి వెంకటసుబ్బమ్మగారు



రాజమండ్రీ గోదావరొడ్డున ఒక బ్రాహ్మణగృహము. వీధివేపున ఎత్తయిన అరుగులూ, వెనకవేపు విశాలమైనదొడ్డీ, దొడ్లో వృక్షాలూ అవీవుండి చల్లగావుంటుంది. దొడ్లో ఒక నుయ్యికూడావుంది. మొత్తం మీద యింటివైఖరిచూస్తే పురాతనంమాదిరీ కట్టడమని వీధిలోకే తెలిసిపోతుంది. ఒకనాటి సాయంకాలం వారిదొడ్లో యిద్దరుబాలికలు ఆడుకుంటున్నారు. వారు చాలాసేపటినుంచి పరుగెత్తి ఆడుకొంటున్నట్లుగా అలిసిపోయినవారి మొఖాల్లో కనిపిస్తోంది. కొంతసేపటిలోనే వారు ఆటమానించి నూతిదగ్గరకొచ్చి నీళ్లు తోడుకునితాగారు. ఎత్తుగాకట్టిన నూతిఅంచును ఆనుకునినుంచున్నారు ఆయాసంతీర్చుకొంటూ. ఒకటి రెండు నిమిషాల్లో ఒకమ్మాయిఅంది 'శారదా యింక నేను యింటికివెడతానే. మాఅమ్మ యివ్వాళ చాలాపనిలో వుంది. మాతమ్ముడిని ఎత్తుకోకపోతే కోప్పడుతుందికూడాను. త్వరగా రమ్మంది' అని లలిత అనగానే 'ఓహో! మీఅత్తారు వస్తారటకదూ శ్రావణపట్టీతీసుకుని. శ్రావణపట్టీలో ఏమినగతెస్తారే' అంది శారద. 'పెళ్లికి చంద్రహారంపెట్టారుకదూ. యిప్పుడు వడ్డాణం చేయిస్తారట. పైగా మూడువందల తులాల వెండి కొన్నారుట మా మామగారు. నాకోసం పూజసామానులు చేయిస్తారుట. మా అత్తగారు, మామగారు చాలా మంచివారుట. మాఅమ్మ వాళ్లు చెప్పగుంటూంటే విన్నాను' అంది లలిత. 'అవును. పైగా వాళ్ళకి వేరేఆడపిల్లలు లేరేమో. ఏముచ్చటచేసినా నీకేగా' అని శారద అంది. ఈవిధంగా ఏవో చెప్పగుంటూ వెళ్లిపోయారు.

శారదకి యిద్దరు అన్నలు. ఒకనికి 20 యేళ్లు, యింకొకనికి 18 యేళ్లూను. ఆ తరవాత యెనిమిదేళ్ళకి శారదపుట్టింది. యిప్పుడీమెకి 10 వ సంవత్సరం. ఒకనాడు శారదఇంట్లో భోజనాలసమయం. ఆనాడెందుకో గాని శారద మేనమామకూడా ఉన్నాడు. అందరూ భోజనాలుచేస్తున్నారు. ఆమాటా యీమాటా చెప్పగోడంలో శారదతల్లి భర్తతోఅంది. 'ఇప్పటికిమన అమ్మాయికి సంబంధం కుదర్చలేకపోయారు. చూడండి వాళ్ళ లలితకి శ్రావణపట్టీ తీసుగొచ్చారు. అత్తారుతెచ్చిన పట్టుచీరకట్టుకొని పూజచేసుకుంటోంటే చూడ ముచ్చటేసింది. వెండి సజ్జనిండా పువ్వులుపోసి పూజసామానులతో సహా అందించింది అత్తగారు. మామగారు దగ్గిరకూచుని పూజచేయించారు. యిదంతాచూస్తే లలిత అదృష్టవంతురాలనిపించింది' అంది. 'సరే ఏంచెయ్యమంటావు నేనుమాత్రం పూరుకున్నానా. అయిదెకరాల భూమియిచ్చి అయిదు వేల కట్నంకూడా యిస్తానని తిరుగుతున్నాను. ఇంతకీ భగవంతుడుకూడా సాయంచెయ్యాలికద. మనమ్మ యెక్కడికి వెళ్ల వలసుందో; ఆ మొగుడెక్కడినుంచి దిగిరావాలో ఎవరికితెలుసు. ఖంగారుపడి ఏంలాభం. పోనీ, అంటే గట్టిగా కూడా అనకోకూడదు. శారదాబిల్లొకటి వచ్చిందికదూ. పధ్నాలుగేళ్లు వచ్చిందాకా పెళ్లిచెయ్య కూడదుట' అన్నాడు శారదతండ్రి. 'ఈ చట్టాలకేమిలెండి. అందరూ చెయ్యటంలేదా? మనము అల్లాగే చేద్దాము' అందితల్లి. శారద మేనమామ సుందర్రామయ్య కలగచేసుకుని 'అక్కయ్యా నువ్వేమనుగుంటున్నావో గాని పట్టుకున్నారంటే జుల్మానా వెయ్యడమేకాకుండా ఖైదులోకూడా పెడతారు. చట్టమంటే మాటలు కాదమ్మా' అన్నాడు. 'అసలు మనశారదకు జదువుచెప్పించి పెద్దదయాక దానికి చూపించి నచ్చిన మొగుడుకిచ్చి వివాహంచెయ్యడం మంచిదన్నాడు' పెద్దన్న రామారావు. 'నిజమేబావా నాకూ అల్లాగే

తోస్తోంది. ఎవరిమనసు వాళ్లకి వికసించి వాళ్ళవాళ్ళ యిష్టంమీద భార్యా భర్తలు యెన్నుకుని పెళ్లిచేసుకుంటే ఆసంసారం మరీ అందంగావుంటుంది. శాస్త్రుల్లుగారి సరళమొగుడేంచేశాడో చూశారా? ఆపిల్ల నల్లగావుందనీ చదువుకోనిశుంఠనీ, తనకి తెలియనివయస్సులో అంటకట్టారనీ ఏవేవో వంకలుపెట్టి తీసికెళ్లడం మానేశాడుట. నాలుగేళ్ళనుంచి ఏడుస్తూపుట్టింటిదగ్గిర పడుంది పాపం' అని సుందర్రామయ్య బలపరిచాడు, యిటూ అటూ శారదలేదుకదా అని దిక్కులు పరికించి. 'మీలో మీరు సరిపెట్టుగోడంచూస్తే చిత్రంగావుంది. ఎవడో ఒక తుంటరివెధవచేస్తే సరాయేమిటి. వాళ్ళశ్యామలకి యెనిమిదేళ్లపిల్లప్పుడు పెళ్ళయింది. అదిమాత్రం నల్లగ లేదూ, నిక్షేపంలాగున్నారు చిలకాగోరింకల్లా. 200 రూ. వుద్యోగంటకూడాను అతనికి' అంది తల్లి. 'ఊరుకోవమ్మా అక్కయ్యా నీకు తెలియదు. శ్యామలమొగుణ్ణి నేను బాగా యెరుగుదును. రెండువందల్లోనూ యింటికితెచ్చేది ఏభయిమాత్రమే. మిగిలింది భోగమాళ్ళకి, కిల్లీలకి, సిగరెట్లకి సరిపెడతాడు. పాపం తండ్రి బాగున్నాడు కనక గుట్టుగా నడుస్తోంది సంసారం'అన్నాడు సుందర్రామయ్య. 'మళ్లీ నిజమేరా ఆలోచించగా ఆలోచించగా ప్రపంచకం అల్లాగే ఏడుస్తోంది. పెద్దవాళ్ళయాక వాళ్ళకి నచ్చిందో లేదో కనుక్కొని మరీ పెళ్లిచెయ్యడం మంచిది అనిపిస్తోంది. ఆపైన యెవరికర్మ వారిది. అజ్ఞానదశలో పెళ్ళిచేశారని మనస్సు క్షోభించనక్కరలేదు' అన్నాడు తండ్రి. మొత్తంమీద శారదపెళ్ళి ఆపుచేసి చదువులో పెట్టడమే నిశ్చయంచేసుకున్నారు.

౨

ఆరు సంవత్సరాలతర్వాత. శారదహైస్కూలుచదువు పూర్తిచేసి కాలేజీలో ఇంటరులోచేరింది. యింతవరకు ఆమె పెళ్ళివిషయమే మరిచిపోయింది. చదువులోపడిపోయింది. బాగాచదవాలనీ, మంచిమార్కులు తెచ్చుకోవాలనీ, మేష్టర్లచేత బహూకరింపబడాలని ఎంతమటుకు ఆమెకోరిక. ఆమెక్లాసులోనే చదువుతున్నాడు ప్రభాకర్ అనే అతను. మంచి తెలివయినవాడు. వయస్సు పాతికేళ్లుంటాయి. చామనచాయ. సన్నంగా పొడుగ్గావుంటాడు. కళయినమొఖం. కళ్లల్లో సరస్వతి తాండవం ఆడుతోన్నట్టుంటుంది. శారదకూర్చునే బెంచీకి ఎదురుబెంచీమీదే తను కూర్చుంటాడు. అన్నిటిల్లోనూ యితనికి మంచిమార్కులు వస్తాయి. యితను బాగాచదవడం మంచిమార్కులు తెచ్చుకోడం చూసింది శారద. అతనితో స్నేహంచేసి లెఖలు అవీ నేర్చుకుని తనుకూడా మంచిమార్కులు తెచ్చుకోవచ్చుకదా అని ఆలోచించి ప్రభాకర్‌తో స్నేహంచెయ్యడం మొదలెట్టింది. తెలియని లెఖలు నేర్చుగోడం, అతని నోటుపుస్తకాలు అడిగితీసుకుని తెలియనివి వ్రాసుకోడం, తనపుస్తకాలు అతనికియ్యడం మొదలయినవాట్లతో వీరిస్నేహం వృద్ధిపొందింది. యీవిధంగా ఒకసంవత్సరం గడిచిపోయింది. వేసంగిశలవులు వచ్చేశాయి. —( సశేషం )

(నవంబరు సంచిక తరువాయి)

# గృహలక్ష్మికి పద్యరత్నములు

శ్రీ కల్లూరు అహోబలరావు

సౌభాగ్య శాంతివాసము శోభావతి! నీకు మేలు జొప్పడు ; దీనన్
లాభము నీయారోగ్య మహాభాగ్యము రక్షసలుపుమా! గృహలక్ష్మీ!

ఉడుకుడు కన్నము జారను పుడిచెట్నీ లధికఘృతము బొలుపగు కూరల్
కడురుచిగను తినవచ్చును ; విడువ కుడుకునీరు గ్రోలు - ప్రియగృహలక్ష్మీ!

టెంకాయ, నూనె, మజ్జిగ, వంకాయలు, పచ్చి మిరపవస్తువు లెపుడున్
సంకటము దెచ్చు గావున పంకజముఖి! వాడవలదు ; వరగృహలక్ష్మీ!

మూడునెల లైనంబధ్యము జేడియ! నీవుండవలయు! క్షీరముదమితోన్
వాడుము రేబవలులు ; కాపాడుము నీదేహబల్మి ; వరగృహలక్ష్మీ!

నీతల్లి నీదుశుభములఁ జేతంబునఁ దలఁచి నిన్ను శిక్షించెడి, యా
రీతుల మెలఁగుచు నుండుము నాతులలోఁ గీర్తి కలుగు ; నయగృహలక్ష్మీ!

ఇక్కాలంబది సూక్ష్మము మక్కువ నేరోగమైన మసలును గానన్
చిక్కు చెదరక పటుత్వం బుక్కడఁగ కాడఁజూచుకో ; గృహలక్ష్మీ!

తలయంటుచు జలకంబుల వెలఁదిరో! నీవాడవలయు : వెచ్చనినీరం
బుల, వరుస దినంబులలోపల నారోగ్యంబు కొఱకు ; వరగృహలక్ష్మీ!

చన్నీళ్లంటకు పాపకు వేన్నీళ్లు దినంబు పోసి వెచ్చని యుయ్యా
లన్నిదురంట సుఖమ్ముగఁ జన్నిచ్చియు పాడవమ్మ ; జయగృహలక్ష్మీ!

పతియింటి కేగ వలయును కుతుకంబునఁ బుట్టినింటఁ గొమరిత లెపుడున్
సతతము నిలువఁగఁ జెల్లదు సతిధర్మ మెఱుంగవలయు జయగృహలక్ష్మీ!

ఐదవ నెలలోపల ముత్తైదువ! నీవిభుఁడు వచ్చుఁ దమి నీకొమరున్
మోదమున నెత్తి కొంచును సాదరమున నతని వెంటఁ జనఁదగు ; లక్ష్మీ!

పుట్టింట లక్షలుండిన మెట్టినయింట్లే శుభంబు మెలఁతల కొసఁగున్
పుట్టింటివార లేమియుఁ బెట్టనిచోఁ దిట్టవలదు ; ప్రియగృహలక్ష్మీ!

మాతృఋణంబును తీర్పఁగమాతా! నీతరముగాదు! మాతృత్వము, నీ
కీశతినబ్బిన దీఁకమిూదే తెలిఁగున నడతువో ళ్కా ? ధీ గృహలక్ష్మి!

అత్తలకు నాడుబిడ్డల కెత్తెఱగున మదినొసంగి హితమొసఁగెదవో
బిత్తరి! చూడగ వలయును క్రొత్తలుగాపురము జూచుకో! గృహలక్ష్మి!

మఱదండ్రు, బావగారలు కఱకుబలుకు లెప్పుడైనఁగఠినముగానన్
బిఱుసుదనంబునఁ బల్కినఁదెఱవా! కోపింపఁ జనదు; ధీ గృహలక్ష్మి!

మామలఁబెద్దల వృద్ధులఁబ్రేమంబునఁగాంచి, వారిప్రియమెఱిఁగియునీ
వేమఱక సేవసల్పుము సామంబునఁ బనులుజరుగు; జయగృహలక్ష్మి!

ఎన్నిపనులున్న భర్తనుమన్నించియుఁ బ్రేమఁగొనుము; మహిళామణి! నీ
చిన్నికుమారుని మఱువక దిన్నగ రక్షించుకొమ్మ! ధీ గృహలక్ష్మి!

అత్తయు గట్టిదియైనన్ జత్తంబున నైననామెఁజీగొట్టకు; నీ
యుత్తమ గుణములనత్తయె మెత్తపడున్ క్రమముగాసుమీ; గృహలక్ష్మి!

అత్తయు నొకపరికోడలె తత్తర మొందంగవలదు తరుణీమణి! ప్ర
త్యుత్తరములఁ గలహముకే కెత్తును; మౌనంబు మేలు; హితగృహలక్ష్మి!

ఎప్పటి కెయ్యదిహితమో తప్పకనామాటలాడి తగుకొలదిగ, నే
చప్పుడులేకయె పనులన్నప్పటి కప్పటికె సల్పనగు; గృహలక్ష్మి!

సంసార మహాచక్రము హంసగమన! త్రిప్పవలయునతిహర్షమునన్
హింసలు గష్టంబులు, ధాత్రింసహియింప వలయుసుమి! ప్రియగృహలక్ష్మి!

ఆరోగ్య మహాభాగ్యము ధారాళముగాఁ బ్రోవదగునీ వెలమిన్
వీరోత్సాహము లంతట హేరాళముగాగ బర్వు; హితగృహలక్ష్మి!

కేసరి రత్నత్రయములతో, సరిరావెన్నియేని తోరపుమందుల్
వేసటపడకను వాటిని వాసిగనుపయోగ పఱుపవలె; గృహలక్ష్మి!

నిర్భీతి 'లోధ్ర' వాడిన గర్భాశయరోగములను గాలించియు, వే
దుర్భరఋతుశూల లడఁచి స్వర్భువనపు సౌఖ్యమొసఁగు; జయగృహలక్ష్మి!

మలబద్ధ మజీర్ణంబులు కలిగినసోమరితనంబు గడుపున మంటల్
వెలిద్రోలు 'సమృత' దీనిన్ కలకాలమువాడఁ దగునుగా - గృహలక్ష్మి!



—పశేషము.

# ★ నెల్లూరి భక్తులు :
# ★ కీర్తిమూర్తులు శ్రీ పిల్లారిసెట్టి కోదండరామదాసుగారు

★ కీ॥ శే॥ వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు

ఇదియొక వింతయైన రచనగనున్నది. లక్ష్మీ, పార్వతుల సంవాదమనియు, గంగా, గౌరుల సంవాదమనియు స్త్రీలుకొన్ని పాటలు పాడుకొనుచుండుట గలదుగాని ఈ రామకృష్ణ భక్తుల సంవాదమందు శ్రీరామభక్తుడును, శ్రీ కృష్ణభక్తుడును పరస్పరము స్పర్థించుకొని తమ యిష్టదైవమును పొగడుకొనుటయు అన్యదైవము నధఃకరించు టయు వినోదముగ జెప్పబడియున్నది. ఇది 185 చరణములు గల్గియున్నది. ఈ ప్రహేళికా వేషమున నీ కవిగారు రెండవ తాంలీల సొంపుగ స్మరించియున్నారు.

11. రామ కృష్ణ, భక్తుల సంవాదము.

శుద్ధ కాంభోధిని రాగము — ఆదితాళము.

చీనాంబరములు దివ్యచందనము - చెలగి ధరించెను కృష్ణుడు
జింక చర్మమును పేడబూడిద[1]యు - కొంకక దాల్చెను రాముడు 50

రజకుని గర్వపు మాటలవాని - శిరమును ద్రుంచెను నా కృష్ణుడు
రజకునిమాటకై యడవికి - భార్యను బంపెను నీ రాముడు 55

జననీ జనకులు చెరలు మాన్పిబల్ - సౌఖ్యము బెట్టెను కృష్ణుడు
జనని విధవగా తండ్రి మృతుడుగా - వనమున కేగెను రాముడు 64

మేలగు చెల్లె సుభద్ర[2]గోరితె - మేరగాదనె కృష్ణుడు
బిడ్డని యెంచక భూసుత సీతను - పెండ్లాడెను నీ రాముడు 108

ఎక్కువ వైష్ణవ మతము గలిగి - పరవెలదుల జూడడు రాముడు
అక్కతో సమమగు అత్తను గూడిన అతిపాపి గదా నీ కృష్ణుడు 129

ఈ విధమున రామ కృష్ణ భక్తులు పరస్పరము దూషణ, భూషణలతో వివాదించుకొనుచుండ మన కోదండ రామదాసుగారు అడ్డుపడి మధ్యస్థముజేసి తీర్మానించి ఉభయులకును సఖ్యముకుదిర్చినటు లీసంవాదము సమాప్తమగుచున్నది :—

(1) ఈ విషయము రామాయణమునలేదు. భవభూతిమహాకవి మహావీరచరితమను నాటకమున "భస్మస్తోమ పవిత్రలాంచనమురో ధత్తేత్వచంరౌరవీం" అని శ్రీరాముని (లక్ష్మణునిగూడ) వర్ణించినాడు.

(2) ఈ యైతిహ్యము జగన్నాథక్షేత్రసంబంధమైనది ;—

"నీలాచలనివాసాయ నిత్యాయ పరమాత్మనె । సుభద్రాప్రాణనాథాయ జగన్నాథాయ మంగళం" అనియొక వైష్ణవస్తుతి యున్నది.

మనకిద్దరికిక వాదమేలనూ - మారాముడు మాకృష్ణుడు
దనరగనొకరె యనిదెల్పెను - కోదండరామదాసుడు మేల్ ఘనుడు 185

అంతట నొక మంగళహారతియుగలదు ;—

♦ ♦ ♦

సీతామనోబ్జసద్భృంగా సత్సంగ(శ్రీ) - రుక్మిణీనాథ శ్రితజనోత్తుంగా - మంగళం.

♦ ♦ ♦

ఈ సంవాదమును వేరుగ పూర్తిగ నచ్చువేసిన బహుజనము ప్రీతితో నాదరింతురు.

దాసుగారి యుద్యోగకాలమున తహసీల్దారె మేజస్ట్రీటు అధికారముకు కలిగియుండెను. వకీళ్లపోరుపడ లేక రామకృష్ణ భక్తుల సంవాదమిషచే వకీళ్లపై కసి నిటుల వెలిబుచ్చుకొని యున్నారు.

పార్వతిరుద్రుడు సహా జపియించిన - పటుతరనాముడు రాముడు
వకీళ్లవలెదబ్బర వాదించక - చెపుమెవరికి జపమో కృష్ణుడు 131

శ్రీ పిళ్లారిసెట్టి కోదండరామదాసుగారి యాఖ్యాయిక ఇట్లు సంక్షేపింపబడుచున్నది. దీని సిద్ధము చేయుటయందీ వ్రాయసకాడు శ్రీ దాసుగారిపౌత్రులు రావుసాహెబు శ్రీ మన్నాధరావు నాయుడు గారి సహాయమును విశేషముగ బొందియున్నాడు. దాసుగారిరచనలు వీరియొద్దనున్నవి. వీరుగాని తచ్ఛాఖీయులుగాని స్వశాఖాభిమానమున వీనినెల్ల కూర్చి ముద్రింపించిన నిదియొక భాషాసేవగను లోకసేవగను యుండగలదు. అటులుగాకున్న యున్నిగ్రంథముల జెప్పిన నీకవిగారు విస్మృతగణమున జేరుదురు. కవులయెడనట్టిది భావ్యమగునా? వారిని స్మృతిపథమున నుంపగలుగుటయే తరతరములకు వారికితగు సన్మానమగును.

సమాప్తము.

# శ్రీ త్యాగయ్య భక్తిమార్గము.

కొల్లోపేలు సూర్యనారాయణరావుగారు

---

భక్తిమార్గమందలి యౌన్నత్యమును శ్రీ త్యాగయ్యగారు ముఖారి రాగములోని "క్షీణమై తిరుగ" అను కీర్తనయందిట్లు పాడియున్నారు.

పల్లవి

క్షీణమై తిరుగ జన్మించే సిద్ధి మానురా ఓ మనసా ॥ క్షీణమై ॥

అనుపల్లవి

గీర్వాణ నాటక అలంకార వేదపురాణ
యజ్ఞ జపాతపాదుల ఫలములు ॥ క్షీణమై ॥

చరణము

పరిజేసిన జగన్నాథుడు శిరమున
హృదయమున వహించి
పదిలమైన సత్పరము నొసంగే చోట
త్యాగరాజనుతుని భజనరా ఓ మనసా ॥ క్షీణమై ॥

సంస్కృతమందు చెప్పబడిన నాటకములు, అలంకారములు, యజ్ఞములు, జపతపములు చేయుటవలన యేర్పడిన పుణ్యము క్షీణించినతోడనే జీవుడు తిరుగ భూమిపై జన్మమెత్తవలయును. అవి స్వర్గసుఖమును కొంతకాలమువరకు మాత్రమే యనుభవించుటకు జీవునకుపయోగించునే కాని జన్మరాహిత్యమగు మోక్షమున కెంతమాత్రమును సాధనములు గావని పల్లవి, అనుపల్లవులలోని భావము. ఈ భావమునే భగవద్గీతలోని శ్లోకము "తేతంభుక్త్వా స్వర్గలోకంవిశాలం క్షీణేపుణ్యేమర్త్యలోకే విశన్తి" యని విశదీకరించుచున్నది.

కావున యేమార్గమందు ప్రవర్తించిన భగవంతుడు జీవుని బహుజాగ్రత్తగా గమనించి చాల భద్రమైన (అనగా తిరుగ జన్మమునెత్తని) మోక్షపదవి నొసంగునో యామార్గము శ్రీరామభక్తియేయని ప్రశ్నోత్తరములను రెంటిని చాల రమ్యముగా చరణమందిమిడ్చి పాడియున్నారు. దీనివలన భక్తిమార్గము చాల గొప్పదని అయ్యగారి యభిప్రాయము.

---




తన రచనల్లో ప్రేమచంద్ స్త్రీ సమస్యలను గురించి ఎన్నో విషయాల్ని విపులీకరించాడు.

విధవజీవితం తపించేజీవితం. లోకం దీనికి విపరీతంగా ఏమీచూడలేదు. పచ్చడి, చారుతో తన ఆకలితీరనట్లే, భోగవిలాసాల్లో, షికార్ల తమాషాల్లో స్త్రీఆత్మ సంతోషంపొందలేదు. జీవితం ఏదో ఒక నిజంమీదనే నిలుస్తుంది. కష్టాల్ని సహించడంలో, సిద్ధాంతాల్ని రక్షించడంలో స్త్రీలు పురుషులకు ఎప్పుడూ వెనుకబడివుండలేదు.

స్త్రీహృదయంలో స్త్రీనిగురించివుండే ఆవేదన పురుషహృదయంలో వుండదు. నాట్యం విలాసానికేకాదు. భక్తి, ఆధ్యాత్మిక ఆనందానికి అది ఆదివస్తువు. అయినా మనం దాన్ని లజ్జాస్పదంగా చేశాం. ఆ నాట్యకత్తెలను భోగవస్తువులుగా చేసుకోడం తన తల్లులకు, సోదరీమణులకు అవమానం చేయడమే.

స్త్రీ ఏదో విషయంమీద పట్టుబడితే పురుషుడు లేదు, కాదు అని ఎలా అనగల్గుతాడు?

స్త్రీలో రూపమే అన్నింటికంటే ప్రియమైన వస్తువుకాదు. పుత్రులు, భర్త తర్వాత స్త్రీకి ప్రియమైన వస్తువులు నగలు. వాటికోసం స్త్రీ భర్త, పిల్లల్నికూడా విసర్జిస్తుంది.

తల్లిలో వాత్సల్యం వుంటుంది కాని సోదరిలో ఏముంటుంది? పురుషునిలో తెలిసికూడా తొలగించుకోని పశుత్వం కొంచెంవుంది. ఆ పశుత్వమే అతన్ని పురుషునిగా చేసింది. వికాస క్రమంలో అతను స్త్రీకంటే వెనుకపడివున్నాడు. ఏరోజునైతే అతను పూర్ణవికాసాన్ని పొందుతాడో ఆ రోజున అతనూ స్త్రీగా మారతాడు. వాత్సల్యం, స్నేహం, కోమలత్వం, దయ యీ ఆధారములమీదనే సృష్టి నిల్చివుంది. ఇవే స్త్రీయొక్క గుణాలు. స్త్రీ ఇవన్నీ తెల్సుకుంటే యిద్దరి జీవితాలు సుఖంగానే వుంటాయి. స్త్రీ కూడా పశువుతోపాటు పశువైతే యిద్దరూ దుఃఖంతో వుండాల్సిందే.

స్త్రీఎడల తనధర్మాన్ని నిర్వర్తించలేని పురుషుడికి ఆ స్త్రీని శాసించడానికి అధికారం ఏముంది?

స్త్రీ దుర్బల. ఇందువల్ల ఆమెకు మానావమానాల దుఃఖంకూడా అధికమే.

వృద్ధురాలైన స్త్రీ పరిహసించడంలో అజేయురాలు. స్త్రీలను ప్రపంచం అబల అంటుంది. ఎంతటి మూర్ఖత్వం? మానవుడు ఏవస్తువునైతే ప్రాణంకంటే ప్రీతితో చూస్తున్నాడో ఆ వస్తువు స్త్రీ మూర్తిలోవుంది.

తల్లిదండ్రులు, సోదరులు దగ్గర ఆడపిల్లకువున్న స్వేచ్ఛ అత్త దగ్గర మాత్రం వుండదు.

పురుషుల ఆజ్ఞల్ని పాటించడమే స్త్రీల ధర్మంగా మనం భావిస్తాము. స్త్రీ, పురుషుల ఆలోచనలు, ఆదర్శాలు ఒకటైనప్పుడు స్త్రీ, పురుషుని కార్యాల్లో బాధగా కాకుండా సహాయకురాలుగా వుంటుంది. స్త్రీలో ఎన్నిగుణాలున్నా ఆకారం అందంలేకపోతే ఆమె పురుషుని దృష్టిలోనుంచి పడిపోతుంది. వారి దాంపత్య జీవితం దుఃఖమయంతోనే వుంటుంది.

ఆడపిల్లకు విరుద్ధంగాచేసే వివాహం వివాహం కాదు. సౌందర్యం మనోభావంలో వుంటుంది. తల్లి తన కురూప సంతానాన్నికూడా సౌందర్యమయంగానే చూస్తుంది.

స్త్రీలో సౌందర్యమే అన్నిటికంటే గొప్పగుణం

కాదు. స్త్రీలోగాని, పురుషునిలోగాని గుణస్వభావాలే ముఖ్యవస్తువులు. ఇవి లేకపోతే మిగిలినవన్నీ అప్రధానములే!

భగవంతుడు స్త్రీలను నిందా పరిహాసాల కోసమే సృష్టించాడు. కఠినాతి కఠినమైన హృదయంలో కూడా మాతృస్నేహపు కోమలస్మృతి నిండి వుంటుంది.

ఆడపిల్లను బీదవానికి యివ్వండి. కాని ముసలివానికి మాత్రం యివ్వవద్దు. జీవితమంతా ఏడ్పుల్తో, నిరాశతో వుండే దానికంటే బీదతనంలో వుండటమే మేలు.

అలంకరణ భావాలు నేతిబీరకాయ లాంటివి. సౌందర్యానికి అలంకరణలు అవసరంలేదు. కోమలత్వం అలంకరణ భారాన్ని సహించలేదు. అబల దగ్గర ఆత్మరక్షణకు కౌశలంతప్ప వేరే సాధనమేముంది? పతిప్రేమ నారీ జీవితానికి ఆధారం. దానిని వంచిస్తే అబల నిరాధారురాలు. స్త్రీ బుద్ధి తీక్ష్ణమైంది. రమణీ హృదయం సేవ అనే సూక్ష్మ పరమాణువుల్తో నిర్మించబడ్డది. ఆమె ప్రేమకూడా సేవే! ఆమె అధికారంకూడా సేవే! అఖరికి ఆమె క్రోధంకూడా సేవే!

పురుషుడు ఎంతటి విద్వాంసుడు, అనుభవశాలియైనా స్త్రీని అర్థంచేసుకోడంలో అసమర్థుడు.

స్త్రీలజన్మ కేవలం భోగవిలాసం కోసమేనా? వారిహృదయాలు ఉన్నత పవిత్ర భావాలు లేకుండా శూన్యంగా వున్నాయా? మనం వారిని కామిని, రమణి, సుందరి మొదలైన విలాస పూర్వమైన నామాల్తో పిల్చి వాస్తవంగా వార్ని వీరత్వం త్యాగం లేకుండా శూన్యంగా చేస్తున్నాం.

స్త్రీ దృష్టిలో పతిప్రేమే ప్రపంచంలో అన్నిటి కంటే ఉత్కృష్టమైన, అమూల్యమైన వస్తువు.

పతి సంపాదనమీదతప్ప ఏ యితర సంపాదనమీద స్త్రీకి అధికారంలేదు.

పతే స్త్రీకి సర్వస్వం.

స్త్రీ ప్రేమ, ఆగ్రహం పురుషుని ఏమీ చెయ్యలేదా?

స్త్రీల నేత్రాల్లో కావాలని ఎవ్వరు తుచ్ఛులౌతాడు?

ప్రౌఢ స్త్రీలు అనురాగాన్ని అవహేళనచెయ్యరు.

పిల్ల గుణవంతురాలు. గుణవతి, రూపవతి. అయినప్పటికీ కట్నం లేకపోయేసరికి దోషభూయిష్టురాలు. కట్నంవుంటే అన్ని దోషాలూ మంచివే! ప్రాణికేమీ విలువలేదు. కట్నానికి మాత్రం విలువవుంటుంది.

తల్లిలేని పిల్లల్ని అడిగి లాలనా, పాలనా చేసేదెవరు?

భార్యనుపొంది మానవుడు గ్రుడ్డివాడౌతాడు?

డబ్బును లెక్కించలేనిఆమె యింటి యజమానురాలు ఎలా అవుతుంది?

ఆనందపు యిచ్ఛతోనే మనం వివాహం చేసుకుంటాము. యువకులు వృద్ధుల్ని అనుసరించకపోతే యువతులు మాత్రం అనుసరించగలరా?

యువకత్వం జారిపోయిన తర్వాత యువతిని వివాహం చేసుకోవడం యిక్కట్లకు పాల్పడడమే! ఇందులో సందేహమేమీ లేదు. స్త్రీ సహజంగా లజ్జతోనే వుంటుంది. కులటల విషయం రెండోది. అయినా స్త్రీ సహజంగా యింద్రియ నిగ్రహం కలది. తనకు సమానమైన యీడుగల భర్తనుపొందితేనే ఆమె ఆనందాన్ని పొందుతుంది. ఆమె హృదయం కల్మషరహితంగా వుంటుంది. ఈడూ జోడూ, యిష్టం లేని వివాహం చేసుకుంటే ఆమె అతనివైపే కన్నెత్తి చూడదు. ఆమె హృదయమంతా దుఃఖంతోనే నిండి వుంటుంది. మొదటిది పండు యిటుకల్తోకట్టిన గోడవంటిది. దానికి చలనం లేదు. రెండోది పచ్చి యిటుకల్తో కట్టిన గోడలాంటిది. అది ఎంతో కాలం నిల్చివుండదు.

కులవతులగు స్త్రీలు భర్తను నిందించరు. అది కులటలపని. స్త్రీ ఎంతటి పరిహాసకురాలు?

యజమానురాలికి ప్రపంచంలో లేనన్ని చింతలు వుంటాయి.

పునర్వివాహపు భర్త తన భార్యను ప్రాణంకంటే ప్రియంగా చూస్తాడు.

సవతితల్లి పేరే చెడ్డది. తన తల్లి విషమిచ్చినా అది అమృతమే.

# నా చిన్ననాటి ముచ్చట్లు

కే. యన్. కేసరి.

## అఖిల భారత సంఘ సంస్కరణ సభ

**(All India Social Reform Conference)**

ముందు దేశీయ మహాసభ (National Congress) తోకూడ సంఘ సంస్కరణసభకూడ ప్రతి సంవత్సరము జరుగుచుండినది. దేశీయ మహాసభ యేవూరిలో జరుగునో అక్కడనే సంఘసంస్కరణసభ కూడ జరుగుచుండెను. దేశీయమహాసభ ముగిసిన మరుదివసమే ఈ సభకూడా ఆ పందిటిలోనే జరుగుచుండినది. దేశీయమహాసభకు వచ్చిన వారిలో సంఘసంస్కరణ సభ్యులుకూడ నుందురు. మహాసభకుచేసిన భోజనాది వసతులు మరి రెండుగోజులు వుండెడివి. ఈ పందిటిలోనే ఈ సభకూడ జరుగుటకు కారణములు లేకపోలేదు. పందిటికి ఖర్చుండదు. ప్రత్యేకముగ సభ్యులకు వసతులను యేర్పాటుచేయ నక్కరలేదు.

పెద్దసభకు వచ్చినవారిలో ఆ వూరిలోనే మరియొకదినము వుండదలచుకొనిన వారందరు ఈ చిన్నసభకు సభ్యులుగ నుండెదరు. ఆ కాలమున ఈ సభ ఆస్థానము బొంబాయిలో యుండెను. దీనికి సంఘసంస్కరణ పత్రికాధిపతి నటరాజన్‌గారు చాల కాలము శాశ్వతాధ్యక్షులుగ నుండిరి. ఈ సభ ముఖ్యోద్దేశములు యేవనగా వితంతు వివాహములు, రజస్వలానంతర వివాహములు ఆక్షేపణలేక జరిపించుట, నియోగులు, వైదీకులు మొదలగు వివిధశాఖలకుచెందిన బ్రాహ్మణులందరు ఇచ్చి పుచ్చుకొనుట, నాయుళ్లు, మొదలియార్లు మొదలగు బ్రాహ్మణేతరులందరు చీలికలులేక యేకమై బంధుత్వమునుచేయుట, అన్నిజాతులలోను కన్యాశుల్కములను, వరశుల్కములను ఖండించుట, సముద్రయానముచేసి వచ్చినవారికి ప్రాయశ్చిత్తము లేకుండ కులములో చేర్చుకొనుట, బ్రాహ్మణ వితంతువులకు తలవెంట్రుకలను తీసివేయకుండుట, అన్నిటికంటె చాల ముఖ్యమైనది యేమనగా అన్నిశాఖల బ్రాహ్మణ వితంతువులందరు యేకపంక్తినకూర్చుని భోజనము చేయుట మొదలగు సంస్కరణల ప్రోత్సహించి పూర్వాచారములను ఖండించుచు తీర్మానములను చేయుచుండిరి.

ఆ కాలమున అరవలకంటె ఆంధ్రులే ఈసభకు ప్రముఖులుగనుండిరి. అప్పుడప్పుడు సభా వేదికలమీద గంభీరోపన్యాసములను గావించుచుండిరి.

సాధారణముగ సంస్కరణసభ తెల్లవారి కాఫీ, ఫలహారములు ముగిసిన పిమ్మట ప్రారంభింతురు. భోజనసమయము లోపల ముగింతురు. గనుక ఒక్కొక్క తీర్మానమునకును వ్యతిరేకులు వుండెడివారు కారు. అన్నిటికిని అందరు చేతులెత్తుచుండిరి. తీర్మానములు చర్చకుదిగిన భోజనమునకు వేళమించిపోవును. ఆలస్యముగ పోయినవారికి ఆకులు వేయరు. గనుక సభను త్వరలో ముగించుకొని భోజనమునకు పోవుచుండిరి.

నాకు చిన్ననాటనుండియు సంఘసంస్కరణయందు యెక్కువ అభిమానముండుట వలన ఈ సభ జరిగినప్పుడెల్లను నేనును పోవుచుంటిని. ఈ సభకు పోవుటకు టిక్కెట్లుండవు. మరి యేవిధమైన ఖర్చులును వుండేవి కావు. అయితే మెంబరుగ నుండుటకు సం॥ మునకు కొద్ది చందాను యిచ్చుకోవలయునని నిబంధనలుండినను యెవరూ చందాను అడుగరు. అడగనిది ఎవ్వరును ఇచ్చుకొనరు.

1927 సం॥ము డిశంబరులో దేశీయమహాసభ మద్రాసులో ఎగ్మూరు స్పర్టాంకు నందు జరిగినది. అప్పుడు నేను దేశీయసభామండపమునకు సమీపముననుండు పూవిరుంద మల్లి (పూందమల్లి) హైరోడ్డులో కాపురముంటిని. దేశీయ మహాసభకు డాక్టరు అన్సారి గారు అధ్యక్షతవహించిరి. సంఘసంస్కరణసభకు బొంబాయినుండి నటరాజన్ గారువచ్చి సభాధ్యక్షతను వహించిరి. వీరు సంఘసంస్కరణ ప్రతికాధిపతియు నగుటవలనను సంఘాధ్యక్షుడుగనుండుటవలనను ఆ సంవత్సరసభకు కొంత ఆధిక్యత కల్గియుండెను. వీరు తమ కుమార్తెతోకూడ మద్రాసుకువచ్చిరి. నటరాజన్ గారికి భార్యలేదు; కుమార్తెకు భర్తలేడు. వీరు యిరువురు కలిసి సంఘసంస్కరణాది కార్యములకు పాటుపడుచుండిరి. నటరాజన్ గారు బొంబాయిలో మంచి పలుకుబడిగలవారు.

మద్రాసులో డాక్టరు ముద్దులక్ష్మిరెడ్డిగారును, అమ్ము స్వామినాధన్ గారును, కమలాదేవి చటోపాధ్యాయనిగారును గొప్ప సంఘసంస్కారిణు లగుటవలన ఈ సభానిర్వాహక బాధ్యత అంతయు వీరిమీదనే ఆధారపడియుండినది. ఈమువ్వురు తమతోకూడ మరికొందరిని చేర్చుకొని యొక ఆహ్వానసంఘ మేర్పరచిరి. ఆ సంఘములో నేనుకూడ సభ్యుడుగ నుండవలసివచ్చెను. ముందు సభాధ్యక్షులు నటరాజన్ గారికి బసను యేర్పాటు చేయవలసియుండెను. అధ్యక్షునితోకూడ బొంబాయినుండి కొందరు వచ్చెదరు. వీరితోకూడ యిక్కడ మరి కొందరు అతిధులుగనుండెదరు. గనుక వీరందరికి తగువైన బస కుదరవలెను. భోజన మజ్జనాదులు జరుగవలయును. వచ్చుచు పోవుచుండు సభ్యుల రాపిడికి తట్టుకొనవలయును.

ఈ విషయములను చర్చించి తీర్మానించుటకు ఒకసభ మాయింటిలో నేకూడినది. వచ్చిన సభ్యులకు ఆనాడు మాయింటిలోనే టీ యిచ్చినాను.

కావలసిన యేర్పాటులనుగురించి చర్చ జరిగినది. గాని నటరాజన్‌గారి బసవిషయము యెవరును సమ్మతించ లేదు - మాయిల్లు చిన్నదని, మానాయన పూర్వాచారపరాయణు డని; మాఅమ్మ వప్పుకోదని, మాయింట్లో జబ్బువారున్నారని ఈలాటి అవకతవక సాకు లతో సభముగిసినది; పిమ్మట ముత్తులక్ష్మిరెడ్డిగారువచ్చి నన్ను ప్రార్థించి నాచేత వప్పించిరి.

కాంగ్రెసుసభకు దీనికి సంబంధములేదు గనుక ప్రత్యేకముగ వీరికి అన్ని యేర్పా టులను నేను చేయవలసివచ్చినది.

అప్పుడు నేనుండినది సుందరమైన భవనము. విశాలమైన హాలులు, చలవరాళ్లను పరచిన సొగసైన నేల, విస్తీర్ణమైన పూదోట. ఈ విడిదియింటికి సున్నమును కొట్టించి సామానులను సర్ది శృంగారించితిని. ఆకాలమున భోజనసామగ్రి దరిద్రహతముగ దొరకు చుండినది. గనుక అంతయు సమకూర్చితిని. పెద్దపెండ్లికివలె ప్రయత్నమును చేసితిని. సభాధ్యక్షుడు వచ్చునాడు యింటికి పచ్చతోరణములను కట్టించితిని. ముఖద్వారమున అరటిస్థంభములను నిలబెడితిని. నటరాజన్‌గారు వచ్చు రైలుబండికి ఆహ్వానసంఘ సభ్యు లందరము వెళ్లి ప్లాట్‌ఫారమున వారినిదర్శించి మాలాలంకృతులనుచేసి మాయింటికి పిలుచుకొనివచ్చితిమి. వారు వచ్చినదిమొదలు స్త్రీ, పురుషులు అనేకులు మాయింటికి వచ్చుచు పోవుచుండిరి. అధికముగ అనుకూలదాంపత్యములు లేనివారు, వితంతువివాహ ములను చేసుకోదలచినవారు వారి సలహాకు వచ్చుచుండిరి.

దేశీయమహాసభకు వచ్చిన నాస్నేహితులు, బంధువులు, సంఘసంస్కరణసభకు వచ్చిన సభ్యులు అందరుకూడ నాయింటనే బసచేయుట తటస్థించెను. నెల్లూరు, వంగవోలు ప్రాంతములనుండి కొందరు వైదికశిఖామణులు నాయింటనే బసచేసిరి. వీరందరికి భోజ నాది సౌకర్యములను యేర్పాటుచేయవలసి వచ్చెను. ఈ పెద్దపెండ్లికి నానాజాతులవారు నాయింట గుమిగూడిరి. టర్కీటుల్లాయిలు, లుంగీలు, బంగీబుట్టలు, గుజరాతి తలపాగాలు, విభూతిబుట్టలు, తిరుమణిపెట్టెలు మొదలగునవి అన్నియు యిక్కడ జేరినవి. కొందరు ముత్తయిదువలు, ముండుముత్తయిదువలుకూడ నాయింటదిగిరి. కాంగ్రెసువారు యేర్పాటు చేసిన భోజనశాలలో వైదికులకు మడి చాలకుండుటవలన వారును మడిసంచులతోను దేవతార్చన బుట్టలతోను యిక్కడికేవచ్చిరి.

వీరిలో కొందరు యజ్ఞ యాగాది క్రతువులను చేసిన సోమయాజు లుండిరి. పగలు 11 గంటలకు భోజనమునకు ఆకులువేసి గంటకొట్టిరి. సభాధ్యక్షుడు, వారికుమార్తె, ముద్దులక్ష్మమ్మరెడ్డి, అమ్మన్నస్వామినాథన్, కమలాదేవితోకూడ కొందరు దొరలు, దొరసానులు ముందువచ్చి కూర్చుండిరి. అంతకు ముందే వైదికులు కొల్లాయిగుడ్డలతోను, ధావళీలతోను దేవతార్చనబుట్టలను ముందు పెట్టుకొని కూర్చుండిరి. క్రమముగ అన్ని జాతులవారు వారివారి వుశుపులతో వచ్చి ఆకులముందర కూర్చొనిరి. వడ్డన జోరుగ జరిగినది. భోజనపదార్థములు, పిండివంటలు ఆకులునిండినవి. అందరు భోజనమును చేయుటకు ప్రారంభించిరిగాని వైదికులుమాత్రము ఒకరిమొఖమును ఒకరు చూచుకొనుచు యెవరుముందాయని యోచించుచుండిరి.

వడ్డించిన ఆకులు ఆకర్షణీయముగనున్నవి. ఆకలి పీకుచున్నది. మనసు అటూ యిటూ లాగుచున్నది. ఈ సమయమున యొక కొంటెకుఱ్ఱవాడు వీరిని కనిపెట్టి— "ఏమండోయి యింకా అట్లా చూస్తూ కూర్చున్నారేం? కానివ్వం"డని పెద్దగ కేకవేసి "శ్రీ మద్రమారమణ గోవిందో హారిః. సర్వం జగన్నాథ"మని బిగ్గరగ అరచిన వెంటనే అందరు అదరి ఔపోసనలను పట్టిరి.

ఈ వైదికబ్రాహ్మణులు వచ్చిన వూళ్లనుండి రెడ్లు, కాపులు, కంసాలులు కూడ ఆనాడు అక్కడికి వచ్చియుండిరి. వారందరు బ్రాహ్మణులు కూర్చుండిన బంతికి యెదురుగనే భోజనమునకు కూర్చుండుట తటస్థించినది. బాపనయ్యలు తలవంచుకొని పప్పుకలుపుటకు ప్రారంభించగనే ఎదుటకూర్చుండిన పిల్లకారు ఫక్కున నవ్విరి. "అబ్బాయిల్లారా! ఇది కలియుగము. వర్ణసంకరణకాలము గనుక అందరము ఒకబంతిలోకూర్చుండిన దోషము లేదు" అని సమాధానముచెప్పి బాపనయ్యలు ఆనాడు తృప్తిగ భుజించిరి.

తక్కిన మూడుదినములుకూడ రాత్రింబవలు సుమారు 500 మంది విందారగించుచుండిరి. ఈ పెండ్లి నాగవల్లి నాలుగోరోజున అంపకాలసమయమున నేను అతిథులకు చేసిన మర్యాదలకు నటరాజన్ గారు, యితరులు అందరు నన్ను స్తుతించిరి. ఈ స్తుతిని నేను యెంతకు కొనుక్కున్నానాయని లెఖచూచుకోగా వెయ్యిరూపాయలకుపైగా బిల్లు అయినట్టు తేలినది.





# ఉపకారము చేయబోతే



ఆ మహాపట్టణంలో నొక సందులో చివరగా మేడ కలదు. ఆ మేడముందు నొక వసారా యుండును. ఇంటికి నలుప్రక్కల ఖాళీస్థలము గలదు. ఇంటివెనుక భాగము అనేక పూలచెట్లతో, ఫల వృక్షభరితమై యున్నది. చిలుకలు ఇత్యాదులు ఈ వృక్షముల మీదనుండి కిలకిలారావములు చేయుచుండును. కోయిల కూతల కంతులేదు. ఈ దృశ్యము చూచువారి కానందముగలుట సహజము. ఆయింటి యజమాని కాంతారావు పేరుప్రతిష్ఠలు వ్యాపించిన వ్యక్తి. కాంతారావుతల్లి శేషమ్మకు, కన్నమ్మయను సోదరికలదు. వీరిద్దరు గాఢానురాగమున స్నేహభావములతో, వాత్సల్యములతో మెలగుచుండిరి. వీరిద్దరికి ఏకైకమాట. ఇంట్లో తిట్టుటకూడ యుద్ధమును కలసియే. వీరియొక్క సంభాషణలు, మనః ప్రవృత్తులు, వినుటకు, చూచుటకు అతిక్రూరముగనుండును. లోకమున నెవ్వరికిని యిటువంటి సంభాషణలు రావు. కానీ వీరిద్దరి గాఢానురాగమైన మైత్రి చీలుట విధివశముగ తటస్థించినది. ఇంత మైత్రి ఎట్లు రెండుగా విభజింపబడినదని అడుగుదురేమో? మాటలలో జాణతనమున్నదిగదా? అప్పకన్న చెల్లెలే రెండాకు లెక్కువ చదివినది. కన్నమ్మను భర్త చిన్నతనములోనే మృతినొందెను. అంటే మరీ చిన్నతనముగాదులెండి; సుమారు పాతికేండ్ల వయస్సున్నప్పుడు. అందులో కన్నమ్మ భర్తకు రెండవపెండ్లి. మామ తహశీలుదారు. భర్తగూడా ఉద్యోగస్థుడే. పూర్వము చాల ఆస్తియుండెను. కాని మేనకోడండ్రు ఈమెను చేరదీసి ఈమె వద్దనున్న ధనము నపహరించి వెడలగొట్టిరి. క్రమక్రమముగా అంతా నశించి పోయింది. చివరి కొకయిల్లు మిగిలినది. ఆ ఒక్క యిల్లుగూడా అమ్మమ్మ నేవారే. ఇల్లు శిథిలావస్థలో యున్నది. దానిని బాగుచేయు విధమెద్ది? చేతిలో చిల్లిడబ్బైనా లేదు. పోనీ మంచిగా యుంటే ఎవరినైనా ఆశ్రయించవచ్చును. కాని నోటి మంచితన మెక్కడనుండి తెద్దాము? సరే! ఇంక ముందువిషయమెట్లు? ఉన్న ఒక్క అప్పను విడనాడుకొనెను. తిండి తినుటకా ఏమీ లేదు. ఉన్ననాడు తినుట, లేనినాడు పస్తుండుట. కన్నమ్మకు, సుభద్రమ్మయను మరదలుకలదు. ఈమె హృదయము నవనీతమువలె కరగిపోవును. సహజముగ సాధువు. తన వదినెగారైన కన్నమ్మ పడు దురవస్థ చూడలేక తానుతీసికొనివచ్చి తనకున్న ధనములోనే ఈమెనుగూడ పోషించుచుండెను. వదినెగారిఇల్లు బాగుచేయించి శుభ్రముగా చేసెను. ఇట్లు కొన్ని నెలలు గడచినది. ఒకనాడు ఈమెతో గూడ కలహమాడి తిరిగి తన సోదరిగారింటికేగెను. అక్కడ తనని పలుకరించేవారే లేకపోయిరి. పోనీగదాయని అప్పకోడలు రమ్మని యింట్లో వుండుటకు వప్పుకొనెను. ఆమె వీరియింట్లో అడుగుపెట్టిన వద్దనుంచి అప్పకు, తనకు సరిపడలేదు. అప్పను వెడలగొట్టి తనే అధికారము చెలాయించవలెనని భ్రమ పుట్టినది. అందుచే నేదో విధమైన కారణము చూపెట్టి నిష్కారణముగా కలహమాడుట మొదలిడింది. కాంతారావుకోసము పెక్కు పెద్దమనుష్యులు వచ్చుచుందురు. వారితో మాట్లాడకుండా ఒకటే రణ, గొణధ్వనులు. ఎన్ని విధముల చెప్పినను వినరు. మాటయందు ఒకరికొకరు తీసిపోరు. "చెప్పులోనిరాయి, చెవిలోని జోరీగ, కంటిలోని నలుసు, కాలిముల్లు, ఇంటిలోనిపోరు ఇంతంత గాదయా విశ్వదాభిరామ వినుర వేమ" అన్న విషయము సార్థకమయింది. అనవసరపు తగవులలో దిగుచుందురు. చివరకు అప్పను స్వాధీనపరచుకొనుటకు చేతకాలేక ఓర్వలేక పోయినది. సరే! ఇంకేం? ఎదుటివారి కున్నదని విచారించిన నొక కన్నును, తనకులేదని విచారించిన రెండవకన్నును పోయినదన్న సామెత వృథా లేదు. కంటిలో పువ్వుగూడా వేసింది. ఇంక ఏమిటిగతి! మరదలు సుభద్రమ్మ ఇల్లు బాగుచేయించి తన్ను పోషింతునన్న ఆవిడతోనూ సరిపడలేదు. పోనీయని అప్ప ఉపకారమునకుపోయి ఇంట్లో వుండమంటే ఇక్కడా సరిపడలేదు. అటూ, ఇటూ గూడా ఉపకారమునకుపోతే అపకారము ఎదురైంది. అసలే కాంతారావు కోపము మధ్యాహ్న మార్తాండుని పోలియుంటుంది. ఇట్లు కలహమాడుతుంటే ఇక ఆయన సహించలేక ఇంట్లోనుండి వెడలి పొమ్మనెను. సరే ఆమె సణుగుచూ, గొణుగుకొనుచూ బయనమై వెడలిపోయెను. ఇప్పుడు యిరుప్రక్కల వారును సుఖముగా నుండిరి.

—***—

మద్దూరి రంగనాయకి.

# నవల



శ్రీమతి సోమయాజుల లక్ష్మీనరసమ్మగారు

ఎచ్చటనైనా కనిపిస్తేచాలు నవలలు. ఎగాదిగజూడడం. అది బాగుంటుంది, యిది బాగుంటుంది అనుకోవడం. ఎవరికినచ్చినదాన్ని వారు ఎన్నుకోవడం. బజారుకెక్కినవైతే అంతో, యింతో మూల్యమిచ్చి తమపరంజేసికోవడం, కానిచో ఎటులతనవశం జేసికోవడమని మథనపడడం - ప్రయత్నాలుసల్పడం - పరిపాటయిపోయింది యువకజనాళికి.

ఎల్లాగో అల్లా తనస్వాధీనం జేసికొన్నాడా - అల్లాజేసి, యిల్లాజేసి - అందాలు చిందులాడే ఆ నవలను నలిపినలిపి పీల్చి పిప్పి జేశేస్తాడు. అతనొక్కడైతే కొంతవరకూనయమే. రోజున్నరలో అతనితోయుండే బేవార్సుకమిటి చేతులన్నిటిలోను తిప్పేస్తారు. పాపం! ఆ నవల ఎల్లా తయారవుతుందో చూడండి.

అంత మోహంతో తనపరంజేసికొన్న ఆ నవలను ఒకసారిచదివిచూచాడా! మరల దానికేసైనా చూడడు. ఎందుచేతనో? చూడకపోవచ్చు. అనుభవించక పోవచ్చు. అధమం తనదగ్గరైనా ఉంచుకొని జాగ్రత చేయడేమండీ!

ఇన్ని నవలలను జూస్తున్నారుకదా! గ్రహించిన సారాంశమేమిటండీ? అంటే అజ్బే అని పెదిమి విరుస్తారు. మరెందుకో యీనవలలకోసం పరితపించడము.

ఆ దర్శములం గ్రహిస్తున్నారా! సున్న.
విజ్ఞానము ప్రసాదిస్తున్నవా! నహి.
మంచినడవడిక నేర్పుతున్నవా! నాస్తి.

మరెందుల కిట్టి రైల్వేసాహిత్య నవలలు. ఒకందుకు సంతసించాలి. చదివినంతసేపు విసుగు జనింప జేయదు. గృహలక్ష్ములారా! యిట్టివానిని వెదికివెదికి సంపాదించి చదవడమెందుకు? మన నవలలకు కావలసిన ప్రసూతితంత్రము - సృష్టివృత్తాది గ్రంథములు నేర్వరాదా!

చక్కనిభాష - విజ్ఞానము - అలంకారసమాసములు. అట్టి హాస్యరసమున్న గ్రంథాలెన్ని లేవూ! వాటిని చదవరేమో? ఎవరిచేతుల్లోనూ కన్పించవు. యీ రైల్వే సాహిత్యనవలలవల్ల శాశ్వతప్రఖ్యాతిమాట ఎల్లా ఉన్నప్పటికీ కాపీరైట్ హక్కులు అమ్ముచుండు 'అండ్ కో' లు పదో పన్నెండో యిస్తున్నాయి నవలాకారునకు, వందలు వందలు సంపాదిస్తున్నాయి అండ్ కోలు.








## పాకపు ఉండలు

5 పలములు ముంతమామిడిపప్పు (జీడిపప్పు) 10 పలములు ఖర్జూరపు ముక్కలు, 5 పలముల ఎండు ద్రాక్ష, 10 పలముల ఎండుకొబ్బరిముక్కలు, 5 పలముల సారెపప్పు, 5 పలముల బాదంపప్పు తీసుకొని వేరు వేరుగ వేగించుకోవలెను. ద్రాక్షను, కొబ్బెరముక్కలను ఎక్కువగ వేపకూడదు. రాళ్లు, యిసుక తీసి వేసిన గసగసాలను 2 పలములు తీసుకొని జాగ్రత్తగ వేగించవలెను. వేగించుటకు మంచినెయ్యిని వాడవలెను. 15 పలముల మంచిబెల్లమును పాకముపట్టి - మంచిపాకములో ఉన్నపుడు 15 పలముల మంచినెయ్యిని పోసి కలియబెట్టి రెండు, మూడు నిమిషములతర్వాత పైన వేగించిఉంచిన పదార్థమును పోసి కలియబెట్టి దించవలెను. కొంచెము చల్లారినతర్వాత 5 పలముల సీనాకలకండముక్కలను వేసి కలియబెట్టి జాపకాయంత ఉండలను కట్టవలెను. ఈ పదార్థము చాల రుచికరముగను, బలవర్థకముగను నుండును. ఇరువదిరోజులకు తక్కువలేకుండా నిలవ యుంచుకోవచ్చును.

## చింతచిగురు చిత్రాన్నము.

లేత చింతచిగురు చాల రుచికరమైనది. దానితో ఎన్నో విధములుగ పచ్చళ్లను చేయుదురు. కందిపప్పు, పెసరపప్పులతో కలిపి పుల్లగూరచేయుదురు. చిత్రాన్నము నిట్లు చేయుదురు:— ½ శేరు పాతబియ్యమును అన్నము వండవలెను. అన్నముపొడిగ ఉండవలెను. వేడిఅన్నమును కళాయిపళ్లెములోకి తోడుకొని, ముందుగ బాగుచేసి ఉంచుకొన్న చింతచిగురును, ఉప్పును, కొంచెము పసుపుచేర్చి బాగుగ కలుపవలెను. ఇంగువ (చిన్నవుసిరికాయంత) పొంగించి పొడిచేసి కలపవలెను. కొద్దిగా ఆవాలు, మినప్పప్పు, సెనగపప్పు, రెండు చిటికల మెంతులు, ఒకస్పూనెడు నువ్వులు వేగించి పొడిచేసి అన్నముతో కలపవలెను. 5 పలముల మంచి నూనె బాణలిలో పోసి కాగినతర్వాత 25 ఎండుమిరపకాయలను వేగించి, దానిలోనే ఆవాలు, మినప్పప్పు వేగించి తిరగబోసి అన్నముతో చేర్చవలెను. ఒక పిడికెడు శనగపప్పు నానబెట్టి నూనెలో వేగించి ముంతమామిడిపప్పుతో కూడా చేర్చి కలుపవలెను. కరేపాకును చేర్చినచో వాసనగాను రుచిగాను ఉండును. మరల ఒకగరిటెడు మంచినూనెపోసి బాగుగ కలిపి కళాయిగిన్నెలో ఎత్తి మూతపెట్టి కొంతసేపయిన తరువాత భుజించవలెను. చాల రుచికరముగనుండును.

పచ్చిమామిడికాయల తురుమును చింతచిగురుకు బదులుగా ఉపయోగించినచో మామిడికాయ చిత్రాన్నమగును. పుల్లదానిమ్మ గింజలతో కూడ నిట్లే చిత్రాన్నమును చేయుదురు. ఈ చిత్రాన్నమునే పులిహోరఅందురు.

వంగోలు కనకవల్లి.

## కేసరి లడ్డు

1 శేరు శనగపిండి ½ శేరు వరిపిండి మెత్తగా జల్లించి, నీటితో గట్టిగాకలిపి, జంతికలుచేసి నేతితో వేయించవలెను. తరువాత జంతికలు మెత్తగా పొడికొట్టి వుంచవలెను. 2 శేర్ల పంచదారకాని, బెల్లంకాని,

వుండపాకం పట్టి 1 తులం ఏలకపొడి, 4 పలముల జీడిపప్పు, 1 తప్పెడు నెయ్యి, కొట్టినపొడి, ఇవన్నియు పాకంలోపోసి కలియపెట్టి, బాగా కలిసినతరువాత వెంటనే వుండలు చేయవలెను.

## ఆంధ్రా స్పెషల్

1 శేరు పాలు కాగనిచ్చి, 1 అరశేరు సగ్గుబియ్యం, 1 అరపంపు సేమియా కొంచం నేతితోవేయించి పాలలోవేయవలెను. 1 కొబ్బరికాయ కోరి నేతితో ఎర్రగావేయించి, 1 తవ్వ పంచదార, అరతులం ఏలకపొడి, 1 పలం జీడిపప్పు, 1 పలం కిస్ మిస్, 1చంచా కుంకుమపువ్వు, 1 సోలెడునెయ్యి అన్నికలిపి 20నిమిషము లుడకనిచ్చి, తీసి పళ్లెంలోపెట్టవలెను.

## గుమ్మడివడియాలు

1 పెద్ద బూడిదగుమ్మడికాయ తరిగి వుప్పువేసి మూటకట్టి, దానిమీద ఒకరాయిపెట్టి వుంచవలెను. 1 శేరు మినప్పప్పు బాగా నానపెట్టి పొట్టుతీసి, మెత్తగా రుబ్బవలెను. 1 ఏబలం పచ్చిమిరపపళ్లు కొంచం ఇంగువ, తగిన వుప్పు మెత్తగాకొట్టి, పిండిలోకలిపి, ముక్కలుకూడా కలపవలెను. నువ్వుపప్పు 1 సోలెడు పొయ్యవచ్చును. ఎండుమిరపకారం అరసోలెడు వెయ్యవలెను. ఒకగుడ్డ తడిపి ఎండలోపరిచి, నిమ్మకాయంత పిండితీసి వరసగా పెట్టవలెను. బాగా 7, 8, ఎండలు ఎండనిచ్చి డబ్బాలోవేసి మూతపెట్టవలెను. అవసరమయినప్పుడు, నేతిలోవేయించి, అన్నంలో వేసుకొనవలెను.

## కాబేజి వెరైటీకూర

కాబేజి సన్నంగా తరిగి, కడిగి కొద్ది నీటిలోవుడికించి వార్చవలెను. పొయ్యిమీద ఒక గిన్నెపెట్టి దానిలో నూనివేసి, తగు ఎండుమిరపముక్కలు, మినప్పప్పు, ఆవాలు, మెంతులు, శనగప్పప్పు, కర్వేపాకు, సమంగావేయించి, మిరపముక్కలు పళ్లెంలోకితీసి, కూరపోపులో వేయవలెను. తగు వుప్పు, పసుపు, చింతపండుపులుసు వేయవలెను. మిరపకాయలు పొడిచేసివేసి కలియపెట్టి దింపి వేరేపెట్టవలెను. పనసపొట్టు, అరటికాయ, బీరకాయ, ఆనపకాయ ఈ మాదిరిగా వండవచ్చును. కాబేజి పప్పుతో కలిపి వుడికించి మినప్పప్పు, జీలకర్ర, మిరపముక్కలు వేయించి, చింతపండు వెయ్యకుండా వండవచ్చును. కొబ్బరి కోరు కలిపి వెయ్యవచ్చును.

## మినపసున్ని

మినుములు 1 శేరు ఎర్రగావేయించి, 1 సోలెడు బియ్యంవేయించి, మినుములు పప్పుగావిసిరి, తరువాత రెండుకలిపి పిండిగా విసరవలెను. 1 వీశ బెల్లం మెత్తగాతరిగి, 1 తవ్వనెయ్యి సలసల కాచి, బెల్లం పిండికలిపి, నెయ్యిపోసి వుండలుచేయవలెను.

చావలి అన్నపూర్ణాబాయి.

—(✱)—




అష్టచూర్ణము:—ప్రతివారును తయారుచేసుకొని యుంచుకొనతగినది. ఇది సామాన్యముగ బజారు అంగళ్ళలో లభించునట్టి యెనిమిది మూలికల సంపుటీకరణచే తయారొనర్పబడును.

| | |
|---|---|
| మిరియాలు | 1 తు |
| శొంఠి | 1 తు |
| పిప్పళ్లు | 1 తు |
| వాము | 1 తు |
| సైంధవలవణము | 1 తు |
| నల్లజీలకర్ర | 1 తు |
| జీలకర్ర | 1 తు |
| ఇంగువ | 1 తు |

శొంఠి, పిప్పళ్లు, ఇంగువలను తగువిధమున వేయించవలయును. వెచ్చచేయుటలో పదార్థమునందున్న స్వభావమగు వాసన తెలియునంతవరకు అని తెలుసుకొనవలయును.

మిగత వానిని బాగుచేసి యెండలో కొంచెముసేపుంచి రోటిలోపోసి మెత్తగ దంచి సూక్ష్మాణువులు గాలిలో యెగరగొట్టుకొని పోకుండ చూచుటమంచిది. వస్త్రకాళితముచేసి పూర్తియగుటకు ముందుగ పొడిచేసిన ఇంగువను చేర్చవలయును.

పిల్లలకు ఉదయమున తల్లులు, ఉగ్గుపాలు కారమునకు బదులు యీ అష్టచూర్ణమునుగూడ నుపయోగించిన పిల్లలకుకల్గు అజీర్ణము, పొట్టఉబ్బుట తగ్గును.

ఈ చూర్ణమును స్త్రీలు, పురుషులుకూడ నుపయోగించవచ్చును.

భోజనమునకుముందు 20 మొ॥ 40 గురిగింజల ప్రమాణమును కొంచెము గోరువెచ్చని నీటితో సేవించవచ్చును. లేదా భుజించుటకుముందు మొదటి ముద్దలో

చూర్ణమును చేర్చికొంచెము నెయ్యివేసుకొని తినిన రుచిని హెచ్చించును. ఆకలి కలుగును. అజీర్తిపోవును.

స్త్రీలకు ప్రసవానంతరముకల్గు సూతికావాతము హరించును. ఋతుశూలాలను పోగొట్టును.

త్రిఫల చూర్ణము:—

| | |
|---|---|
| కరక్కాయ బెరళ్లు | 5 తు |
| తాడికాయ బెరళ్లు | 5 తు |
| ఉశిరకవలుపు | 5 తు |

ఈ మూడింటికిని త్రిఫలములని పేరు. పేరుకుతగినట్లు గుణవిశేషమునగూడ వాత, పిత్త శ్లేష్మములయందు బాగుగ పనిచేయును.

పై మూడింటిని సమాన భాగములుగ యేర్పరుచుకొని రోటిలోపోసి దంచి మెత్తని చూర్ణమునుచేసి వస్త్రకాళితముచేసి శుభ్రమయిన సీసాలో వేసుకొని వుంచుకొనవలయును.

మలబద్ధకముగలవారు రాత్రి పరుండబోవునప్పుడు రెండు అణాల ప్రమాణముగల చూర్ణమును పుల్లతేట మజ్జిగలో వేసుకొని త్రాగిపరుండిన ఉదయమున సాఫిగ విరేచనమగును. పొట్టనొప్పికూడనుండదు. ఈ చూర్ణము సేవించిన కంటికి, వంటికిమేలుచేయును.

పైత్యవికారము, తలతిరుగుట, ఎక్కిళ్లు, గుండెదడ, పసర్లువాంతులు, కండ్లు మసకలుగ నుండుట, తిమ్మిర్లు, రక్తహీనత, కామిలి సంబంధమయిన జబ్బులకుకూడ వాడనగును.

తేనెలో కల్పికూడ సేవించవచ్చును.

# బ్రతుకు తెరువు



స్త్రీలు అనేక రకములైన చేతిపనులు చేయుదురు. అందులో ఒక విధమైన చేతిపనులను స్త్రీల కొరకు వ్రాయుచున్నాను. సాధారణముగా కొన్ని మన ఇండ్లలో తయారుచేయువాడుక, మరికొన్ని బజారులో కొనుట వాడుకయైయున్నది. అలా బజారులోకొని డబ్బు కర్చుపెట్టేకన్నా, వీటిని ప్రతిస్త్రీయు నేర్చుకొనవలెనని ఆశతో వ్రాయుచున్నాను.

## 1. ట్రాన్స్పరెంటు సబ్బు చేయువిధము

| | | | |
|---|---|---|---|
| పసుపుబారు సబ్బుపొడి | 6 పౌనులు | ఆల్కహాల్ | ½ గాలన్ |

రెంటిని నొకటిగాచేర్చి రాగిపాత్రలోఉంచి, చిన్నమంటవేసి కాచవలెను. కాచునపుడు ఒక దానితోనొకటి కలియువరకు బాగుగా కలియబెట్టవలెను. అన్నియు నొకటిగ కరిగినపిదప, పాస్ఫరస్సు ఎసెన్సు 1 ఔన్సు చేర్చవలయును. బాగుగ కలిసిన వెంటనే దింపి బిళ్లలుగ అచ్చులో పొలపోసి చల్లారనిచ్చి పిదప ముక్కలుకోసి యుపయోగించుకొనవచ్చును.

## 2. ఇంగ్లీషు బాత్ సబ్బు చేయువిధము

| | | | |
|---|---|---|---|
| టాలో ఆయిల్ | 4 పౌండ్లు | సస్సా ఫ్రాస్ ఆయిల్ | ½ ఔన్సు |
| పాం ఆయిల్ | 4 ,, | పెప్పర్మింట్ ఆయిల్ | మూడింట 1 వంతు |
| కొబ్బరి నూనె | 2 ,, | లెమన్ ఆయిల్ | ½ ,, |
| ఆల్కహాల్ | 4 పైంట్లు | సిన్నమన్ ఆయిల్ | ½ ,, |
| సోడాలైం (360) | 5 పౌండ్లు | లావెండర్ ఆయిల్ | మూడింట 1 వంతు |

అన్నిటిని ఒకటిగాజేర్చి ట్రాన్స్పెరంట్ సబ్బుచేయు విధముగనే దీనినిగూడచేసి ఉపయోగించుకొనవలయును.

## 4. రిబ్బనులను శుద్ధిచేయు విధము.

| | | | |
|---|---|---|---|
| జీన్ | ½ పైంట్ | మృదువైనసోపు | ½ పౌను |
| తేనె | ½ పౌను | జలము | ¼ పైంట్ |

పై చెప్పబడిన వాటిని నొకటిగ కలిపి రిబ్బను పట్టులను ఒక శుద్ధమైన మేజామీదనుంచి పైమందును పూసి పిదప మంచినీటను మూడుసారులు ఝాడించినపిదప, ఒకటి లేక రెండు నిమిషములు ఎండించి పిదప ఇస్త్రీ చేయవలెను. ఏకారణముచేతనుగూడ రిబ్బను చేతితోతాకి పిండకూడదు. మూడుతొట్లలో నీరు నింపి ఒకటివెనుక నొకటిగ తొట్లలోనే రిబ్బనులను జాడించి పిదప ఆఖరున మంచినీటముంచి ఎండించవలెను. ఆ పిదపగాని ఇస్త్రీ చేయరాదు. ఇస్త్రీ మిక్కిలి వేడిగానుండినగాని ఫలితము కలుగజాలదు.

వాశిరెడ్డి సుశీలా దేవి

# అమెరికా స్త్రీలు

పురుషులతోపాటు భావస్వాతంత్ర్యము, కార్యస్వాతంత్ర్యము కల్గి, హక్కులు ఛలాయించుచు, అవకాశములు చూరగొనుచున్నవారు అమెరికన్ స్త్రీలు. అక్కడి స్త్రీలలో ఇలాంటి వ్యక్తిత్వము ప్రబలడానికి ముఖ్యకారణా లివి అట. 1. సంతాన నిరోధ సాధనములు తెలిసిఉండడం; ఇష్టమైతేనే మాతృత్వము వహించడం. 2 ఆర్థిక స్వాతంత్ర్యము. 3. సరిసమానమైన రాజకీయ హక్కులు 4. స్త్రీ విద్యాభివృద్ధి. అమెరికన్ స్త్రీయొక్క వ్యక్తిత్వము అభివృద్ధిచెందేకొద్దీ వారివివాహధర్మాలు కూడా పరిణామం చెందుతున్నాయి. ప్రస్తుతం వారి అభిప్రాయాలలో వివాహం నైతికవ్యవస్థ కాదు; మతధర్మముకాదు. జంతుశాస్త్రానుసారం మానవ వ్యక్తికి దైహికంగా అవసరమైన సంబంధ బాంధవ్యము. వివాహమునకు సంతానోత్పత్తి అనుబంధంగాదు. పాశ్చాత్యదేశాలలో అన్నిటికన్నా అక్కడజరిగే వివాహాలసంఖ్యలో వివాహవిచ్ఛేధాలసంఖ్య హెచ్చు. 1945 లో, ప్రతి 100 వివాహాలకు, 35 విచ్ఛేదమై పోయినాయి. మరి పురుషులకన్నా స్త్రీలే హెచ్చుగా ఈ విచ్ఛేదాలు కోరారు. 1932 లో విచ్ఛేదాలైన వాటిలో 1000 కి, 735 భార్యలు కోరగా అంగీకరింపబడినవి: 265 పురుషులు కోరగా అంగీకరింపబడినవి.' మాతగా అమెరికన్ యువతికి తనబిడ్డకు స్థూలంగా వస్తు సంపత్తి చేకూర్చడానికైతేనేమి, సూక్ష్మంగా బుద్ధికుశలత కల్పించడానికైతేనేమి ఉండేఅవకాశాలుహెచ్చు. పూర్వపు తల్లుల కీఅవకాశా లింతగా ఉండేవికావు. అయితే అమెరికన్ దంపతుల కాపురాలు - ఆ జన్మాంతం విడగాని జంటకాపురాలకన్నా సుఖంగానే ఉంటున్నాయి. వారి దాంపత్య ధర్మంలోగల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలవల్లనే కాపురంచేసినన్నాళ్లు - ఆనందకరంగా, హృదయ పూర్వకంగా, సుహృద్భావంతో జరుపుకుంటున్నారు.

---

## 'అపూర్వ బాలమేధావి'

తణుకుబోర్డు హైస్కూల్లో 3 వ ఫారము చదువుచున్న కొండూరు శ్రీకృష్ణహరనాథ ప్రభువు అనే 12 ఏండ్ల బాలుడు అద్భుత ధారణా శక్తిని ప్రదర్శిస్తున్నాడు. ఏసంవత్సరములోని నెల తేదీ యిచ్చిననూ, వారముపేరు చెప్పును. వారముపేరు యిచ్చిన, తేదీ చెప్పును. ఏమియు ఆలస్యము లేకుండా, ఆలోచించకుండా, తడుముకోకుండా వెంటనే చెప్పును.

ఈ బాలుని ఆంధ్ర యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు వాల్తేరు రావించి, అనేకమంది ప్రొఫెసర్ల సమక్షములో పరీక్షించిరి. లెక్చరర్లు సహితము లెక్కవేస్తేనేగాని చెప్పలేని పరిస్థితిలో యీ బాలుని తక్షణ సమాధానములకు ఆశ్చర్యపడినారు. బాలకుని అద్భుత ధారణాశక్తికి శ్రీకట్టమంచి రెడ్డిగారు సంతసించి 'అపూర్వ బాలమేధావి' (బాయ్ ప్రాడిజీ)అని పేరిడి, రు. 15/- బహుమాన మిచ్చిరి. మద్రాస్ మొదలగు ప్రాంతాలలో మేధావుల సమక్షంలో ప్రదర్శనము యిప్పించవలసినదిగా కుర్రవాని తండ్రియగు కొండూరి నరసన్న పంతులుగార్కి సలహా నిచ్చిరి.

---

# ఇంటిపనులలో మెళకువలు

సోదరీమణులకు మూడు సలహాలు

మొదటిది ఏమన Dignity of work (పనిపాటల ఘనత). గృహములో ఆనందము, సుఖము, సౌందర్యము ఉండ వలయునన్న స్త్రీ, పురుషు లిద్దరు గృహ కృత్యములలోని వారి వారి వంతు పని చేసి కొనవలయును. ఎంత శ్రీమంతురాలైనను ఇంటికి పెద్దయగు స్త్రీ ఇంటిపనులయందు స్వయముగా శ్రద్ధ తీసికొనని యెడల ఆ గృహము నిర్జీవమై యుండును మీకు రోజును వంటమొదలగు పనులు చేయవల సిన అవసరము లేకపోయినను ఆ పనులన్నియును మీరందరూ నేర్చుకొని యుండ వలయును. ఏపనిగాని మీకు బాగుగవచ్చి ననే మీ నౌకరులచేత చేయించుకో గల్గు దురు. మీరు యింటియందు చేయదగు పనులన్నియు నేర్చుకొనవలయును. వంట, కుట్టు, ముగ్గువేయుట, చెరగుట, పాలు పితుకుట, మజ్జిగచేయుట, నేయికాచుట, వడ్డించుట, బట్టలు ఇస్త్రీచేయుట మొదలగు ముఖ్యమైన పనులన్నియూ మీరు నేర్చు కొని యుండవలయును. ఈ పనులు చేయు టకు మీ రెంత మాత్రమును సిగ్గుపడ నవసరములేదు. ఈ పనులన్నియూ చేత నైన యువతియే గృహమును చక్కగా దిద్దుకొనగలదు. అట్టి యువతియే Real accomplished girl (ప్రవీణురాలైన బాలిక).

నా రెండవ సలహా—(Psychology) మానసిక శాస్త్రము చదువవలయును. మీ రెవరైన విదేశములకేగి చదువ దలచి రేని ఈ శాస్త్రమున కృషిచేసిన ఎంతయో ఉపయోగముండును. అమెరికాలో ఈ శాస్త్రమున పరిశోధనకు కావలసిన పెద్ద పెద్ద లెబొరేటరీ లున్నవట. ఈ మానసిక శాస్త్రము చాల ఉపయోగకరమైన విష యములు దెలుపును. ఇది మిగిలిన శాస్త్ర ములకన్నిటికి పునాదివంటిది. ముఖ్యముగా ప్రతి స్త్రీ ఈ మానసిక శాస్త్రము తప్పక తెలసికొనవలయును. ఈ విద్యకు కావల సిన పుస్తకములు ఆంగ్లమున పెక్కులు గలవుగాని తెలుగున లేవు. ఇప్పుడిప్పుడే రెండు పుస్తకములు వెలువడినట్లు విందుము. అవి ఎక్కడైన దొరికినచో వానిని గాని లేని యెడల ఇంగ్లీషు పుస్తకములేగాని

మీరు చదువవలయును. మీ విద్యార్థి కారులను మీరు యీ మానసికశాస్త్రము ఒక నిర్బంధ విషయముగా చెప్పమని కోరండి. దాని ఉపయోగము ఇంత, అంత యని చెప్పలేను, మీరు దానిని చదివిన దాని విలువ మీరే గుర్తించగలరు.

మూడవ సలహా Optimistic outlook in life develop చేసికొనుట. అది ఏమన మనకెంతటి కష్టమువచ్చినను సర్వమును మంచికొరకే యనెడి సిద్ధాంతము పిన్నలు గనుక మీకిది విపరీతముగా నుండవచ్చును. ఈ జీవితములో కష్టసుఖములు కావడి కుండలు. అందరకు ఎప్పుడో ఒకప్పుడు కష్టములు రాకమానవు. ఆ కష్టములు వచ్చినప్పుడు—మనకన్న దురదృష్టవంతు లెందరు గలరు? సౌఖ్యమన నెచ్చటనున్నది? పూర్తిగా సౌఖ్యమునే అనుభవించువారు ఎక్కడైన గలరా? దీనికన్న ఎక్కువ కష్టములు వచ్చిన ఏమిచేసెడివారము? అంతకన్నా ఇదియే మేలుకదా?" అని మన లను మనమే ప్రశ్నించుకొనిన వాటి జవాబులే మనకు మనశ్శాంతి నివ్వగలవు. ఉపనిషత్తులలోగాని బైబిలులోగాని యున్న వేదాంతపు సలహా ఇదియే.

శ్రీమతి లక్ష్మీరఘురాంగారి 'ఆంధ్రనారినుండి.'

---

# 'సాగిపోయిన' స్నేహలత

శ్రీమతి సుంకర వరమల్లేశ్వరిగారు

వెలుగునీడల వెల్లువిరిసెడి
తెలుగు తేజము తేరిచూడక
రాలిపోయిన రమ్యకుసుమపు
మేలువిన్నారా !

పడతుకల మేలెంచి బ్రతికిన
కడలివెన్నది కదలిపోయెను
వేడిపొంగుల వెడలిపోయిన
విలువ యెట్టిదియో !

కలచిసంఘము తొలచిబాధల
తలచినదిరా ధన్యచరిత్రమై
పలవెతెంగియు బ్రతికిలోకపు
మీలనము గూర్చెన్ !

అత్తకోడల లధికవాదన
చిత్తమెఱుగని చిన్నతగవులు
పెత్తనమునకు 'గుర్తు' గావని
పలికి పోయినది !

ఆడబిడ్డల అదుపుతోబడి
కూడుగుడ్డకు కుములబోకుము
ఒడయుడొకతరి ఒదిగిపొమ్మన
ఒప్పునని చాటెన్ !

పతికెకొన్నిట మతులు లేనిచో
సతతమున్ విధిగతులు తెలిసియు
సుతియె మించక మతికలంచక
బ్రతుకమన్నదిలే !

మహిళమండలి మంచిరోజులు
మహిని వెలగెడి మార్గమదిగో !
సహనశక్తితో సహజగరిమతో
సాగిపొమ్మనెను !

కళలనేర్చుట కాసజెందుచు
మెళుకువగ తామెలగవలెనని
పలుతెఱంగుల పలికిపోయిన
ప్రాభవము జూడు !

మనసుగలియక మమతకుమరక
వినయ భావపు విలువదెలియక
పెనగులాడకు మన్ననీతిని
పలికిపోయినది !

నాగరికమని తలచికొందరు
వాగుచుందురు వక్తలనుకొని
సాగనివ్వకు నట్టివాదన
సబబుగాద నెను !



# ★ స్త్రీలకు సైనిక శిక్షణ అవసరమా ?

కె. నారాయణప్పగారు



నేను అక్టోబర్ గృహలక్ష్మి సంచికలో "స్త్రీలకు సైనిక శిక్షణ అనవసరమా ?" అను వ్యాసము చదివాను. మీరు అన్నట్టు శ్రీ కరియప్ప అమృతసరంలో ఉపన్యసిస్తూ స్త్రీలకు సైనిక శిక్షణ ఇవ్వడం గురించి "దేశం రక్షించడానికి చాలినంతమంది మగవాళ్ళున్నారు. భారత నారీమణులు మంచి భార్యలు, మంచి తల్లులూ కావడానికి తంటాలు పడాలి." అని తన అభిప్రాయం ఇచ్చారు. నిజానికి వారు ఊసుపోక చెప్పిన అభిప్రాయంకాదు. ఎంతో అనుభవంమీద చెప్పిన అభిప్రాయమది. "ఇతర వృత్తులు చేబట్టే పురుషులు సైనిక వృత్తికి ఎలాగైతే లాయఖ్కో, అలాగే స్త్రీలుగూడ లాయఖే" అనడంలో అర్థంలేదు. ఎందుకంటారేమో! ప్లీడర్ని డాక్టరు ఉద్యోగము చేయమన్నట్లుంటుంది.

ఇంకా కొన్ని దృష్టాంతాలిచ్చారు. వాళ్ళందర్నీ వ్రేళ్ళమీద లెఖ్ఖపెట్టవచ్చు. అంత మాత్రంచేత అందరూ అల్లాంటి వారేనని అనుకోరాదు. నిజం చెప్పాలంటే కావలసినంతమంది పురుషులు దేశంలో సైనిక శిక్షణ పొందియున్నారు. పొందుతున్నారుగూడ. అలాంటప్పుడు తిరిగి స్త్రీలకు సైనిక శిక్షణ ఇవ్వమని అడగడంలో అర్థమేమిటి ? అందులో డబ్బులేక చస్తున్న ఈ దేశంలో!

పోనీ సైనిక శిక్షణ ఇస్తామనుకుందాం. దాంట్లో ఎంతమంది కడవరకు నెగ్గగలుగుతారనిప్రశ్న. ఒకవేళ నెగ్గగలిగినా ఏకొద్దిమందో. అసలు ఎంతమంది Attention Position లో నిలబడగల వారున్నారా అని నా సందేహం. ఆ మధ్య డెహరాడూన్ లో స్త్రీ సైనికోద్యోగ శిక్షణా కేంద్రమును శ్రీ కరియప్పగారు చూచేందుకు వెళ్ళినప్పుడు తీసిన ఫోటోలు చాలామంది చూచేఉంటారు. దాంట్లో చూస్తే ఒక్కరైనా సరిగా Attention Position లో నిలబడలేదనే చెప్పాలి. ఇంకా కొంతకాలం క్రిందట పూనాలో అనుకొంటా (సరిగా జ్ఞాపకంలేదు) ఒక 'సెరిమోనియల్ పెరేడ్'కు స్త్రీలు (W. A. C) కూడవచ్చారు. ఒక్క అర్ధగంట నిలబడ్డారోలేదో టపటపమని చింతకాయలు రాలినట్లు ఆ పెరేడ్ కువచ్చిన స్త్రీలలో ఏకొద్దిమందోదప్ప మిగత వారంతా క్రింద కూలారంటే మీరు నమ్మతారా? ఇలాంటివి ఎన్నైనా దృష్టాంతాలు చెప్పకపోగలను.

యుద్ధాలు వడపడానికి ఒక బుద్ధిబలంఉంటే ప్రయోజనములేదు. దానికితోడు శక్తిసామర్థ్యాలు, అనుభవంగూడ ఉండాలి. లేకపోతే ఏమీ లాభంలేదు.

నిజానికివారు అబలలు కాదండీ. వారంతా సబలలని చాలామంది శాస్త్రజ్ఞులే ఒప్పుకున్నారు. కాన ఆ భయమేమీలేదు. రక్షిస్తామనుకోడమేమిటి ? రక్షిస్తాం అని ధైర్యముంది. అదేచాలు. ఆ ధైర్యంతోనే ఇంతవరకూ రక్షించగలుగుతున్నాంగూడ. ఏదో నాకు తెలిసిన విషయాలు ఏదో ఒక రీతిగా తెలిపాను.

ఇంతకూ మాతృలోకం నన్నుగురించి ఏమనుకుంటుందో తెలుసుకోవాలని ఉత్సాహంగాఉంది. మరి కారాలు మిరియాలు నూరుతారో! లేక ఏమైనా చేస్తారో తెలీదు. అయినా తెలుసుకోవాలనిఉంది. మరి ఏమంటారో ?

—( మాతృలోకం ఈ రచయిత కోర్కె తీర్చుగాక గృ॥ సం॥ )



## ★ నవ్వు ★

1 అరుణోదయ రాగకాంతులకంటె సమ్మోహనకరమైనది నవ్వుసోయగము.

2 పున్నమి వెన్నెలకునైతము అలభ్యమైనది నవ్వు వన్నె.

3 పూవులుగూడ పూజింప దగ్గది నవ్వుపొగరు.

4 నిర్మలాకాశమునకు ఆ నిండుజాబిల్లి సొగసెంతో మానవ ముఖాకాశమునకీ నవ్వు జాబిల్లి యందము నంతే.

5 పద్మినికి భానోదయ మెంతప్రియమో మానవప్రకృతి కీనవ్వంత మోహనీయము.

6 సంతోషాలకు చిహ్నమది.

7 సంతృప్తులకు గుర్తది.

8 సద్బుద్ధులకు సూచనది.

9 పూర్ణపక్షపాతియై సృష్టిలో భగవంతుడు మానవులకు ప్రసాదించిన ప్రత్యేక వరమీనవ్వు.

10 ఇదివెలుగని ముఖము అమావాస్య రేయి.

11 ఇది విసరని రూపం పసరం.

★ ఈశ్వర్.

# పద్మావతి యుక్తి

శ్రీమతి పుల్లగంటి సరస్వతీదేవిగారు



గోలకొండ పట్టణమున సుబ్బారాయుశెట్టి అను వర్తకుడుగలడు. ఇతను చాలా ధనవంతుడు. యితనికి పద్మావతియను భార్యగలదు. వీరికి చాలా రోజులవరకు పిల్లలు కలుగలేదు. పద్మావతి అనేక నోములు నోచినది. అనేక వ్రతములు చేసినది. కన్యకా పరమేశ్వరి దయవలన వీరికి పుష్పావతి అను కుమార్తె కలిగినది.

ఈ బాలిక పూర్ణచంద్రునిబోలి దినదిన ప్రవర్ధమానయై పెరుగుచుండెను. కుమార్తెకు యుక్తవయస్సు రాగానె తగినవరునిచూచి వివాహము అతివైభవముగా జరిపెను.

ఈ వివాహమునకు అనేక రకముల మేళములు ఆటగుఱ్ఱములు తెప్పించెను. ఆట గుఱ్ఱములలో దాదాసాహెబు ఆటగుఱ్ఱమనిన చాలా ప్రసిద్ధి. ఈ వర్తకుడు ధనవంతుడు అగుటచే ఆ గుఱ్ఱమునుకూడా తెప్పించెను. ఆట గుఱ్ఱములతో మేళములతో కుమార్తె వివాహము అతివైభముగా జరిపెను.

ఊరేగింపుఅయి యింటికి వచ్చిన తరువాత హఠాత్తుగా దాదాసాహెబు గుఱ్ఱము మరణించెను. గుఱ్ఱము చనిపోయినది కావున నా గుఱ్ఱము నాకు యివ్వవలసినది అని సాహెబు వర్తకుని అడిగెను. చనిపోయిన గుఱ్ఱం రాదు. గనుక గుఱ్ఱము ఖరీదుగాని వేరె గుఱ్ఱముగాని యిచ్చెదనని చెప్పెను. దాదాసాహెబు వినలేదు.

పెండ్లివారు పెండ్లికివచ్చిన పెద్దలు ఎంత చెప్పినా సాహెబు మూర్ఖముగా మా తాత, నాయన కాలంనుంచి వచ్చిన గుఱ్ఱం. ఆ గుఱ్ఱమే నాకు కావాలి. డబ్బువద్దు; ఏమివద్దు. అని పోట్లాడుచుండెను.

పద్మావతి చాలా తెలివైనది. ఆమె తలుపు దగ్గరవుండి అన్నియు వినుచుండెను. భర్తను యీ యిక్కట్టునుండి తప్పించుటకు ఒక వుపాయము తోచినది.

భార్య భర్తలకు కష్టసుఖములలో పాలుండును. కావున ఒకరి వుపాయమువలన యిరువురికి సంతోషము కలుగును.

ఒకమారు లోనికి రమ్మని భర్తను పిలచెను. వర్తకుడు లోనికిపోయెను. ఆమె తలుపు వోరగా వుంచి అదివరకే దొడ్డిలోని ఓటితొట్టితెచ్చి పెట్టుకొనెను. భర్త లోనికి రాగానే పద్మావతి తలుపు దగ్గరకువేసి తొట్టి తలుపుకు అనించిపెట్టి వుంచెను.

కొంతసేపటికి సాహెబు వర్తకుని పిలచెను. రాలేదు. ఎంతసేపు పిలచినా రానందున కోపము వచ్చి తలుపును గట్టిగా తన్నెను. తలుపుకు ఆనుకొనివున్న తొట్టి భళ్లున బ్రద్దలై ముక్కలు ముక్కలై పోయెను.

వర్తకుడు లబలబ మొత్తుకొనుచూ బయటికివచ్చి నా తొట్టి పగిలిపోయినది; నా తొట్టి నాకు యివ్వవలసినది — అని సాహెబును అడిగెను. పగిలిపోయినతొట్టి రాదు గనుక తొట్టి ఖరీదు ఎంతో అంత కాని క్రొత్త తొట్టిగాని యిచ్చెదను అనెను.

మా తాతలనాటినుంచి వుంచినతొట్టి. మాకు అచ్చివచ్చినది. అదే కావాలి. డబ్బువద్దు. ఏమివద్దు. అని తగవులాడుచుండెను. సాహెబు తన మూర్ఖత్వమునకు ప్రాయశ్చిత్తము అని తెలిసికొని నా చనిపోయిన ఆటగుఱ్ఱమునకు మీ పగిలిపోయిన తొట్టికి చెల్లు అని వెడలిపోయెను.

పద్మావతియొక్క విజ్ఞానమువలన ఆటగుఱ్ఱం, ఓటితొట్టి సమానము అయినది.

విజ్ఞానవంతులైన యువతీమణుల సంసారములు ఆనందముగా యుండును.



# ★ సంఘములో
# ★ స్త్రీ యొక్క స్థానము

★ శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు, బి. ఏ. బి. యి. డి. ★

సాధారణముగా పురుషులు, స్త్రీలను బానిసలుగా చూడటంకలదు. పురుషుడికి స్త్రీ ఎల్లప్పుడు సేవ చేస్తూవుంటుంది. గనుక స్త్రీ, పురుషునకు దాసి అని అనేకమంది, అనేక దేశాల్లో అనుకోవటం కద్దు. ఇది కేవలం తప్పుటభిప్రాయం. స్త్రీ, పురుషుడికన్న తెలివి తేటల్లోగాని, మరేవిషయంలోగాని వడ్లగింజెత్తైనా తీసిపోదు. పురుషులకు మల్లే విద్యావంతులైన స్త్రీలను, ఉద్యోగాలు చేస్తూవున్నవారిని, మంత్రిత్వాలు విదేశములందు రాయబారులుగాను వుండి రాజ్యాంగవిషయాల్లో పాల్గొంటూ వున్నవారిని అనేకమందిని చూస్తున్నాము.

పూర్వకాలంలో హిందూదేశంలో స్త్రీలుకూడా పురుషులతో సమానంగా గురువులవద్ద విద్యనేర్చుకునేవారననీ, రాచకార్యాలు చక్కదిద్దేవారననీ మన గ్రంథాలలో కలదు. చరిత్ర చదువుకున్నవారికి హిందూదేశమును కొంతమంది చక్రవర్తినులుకూడా పరిపాలించారన్న సంగతి తెలిసివుండును. కనపడిన స్త్రీ నల్లా భంగపరచే తురకరాజులు కొందరు రాజ్యమేలినప్పుడు ఎక్కడలేనిదాస్యం, ఎక్కడలేని కట్టుబాట్లు భామలకంఠాలకు తగులుకున్నాయి. కానీ నేడు అలాంటి యిబ్బందులేమీలేవు. అందుచేతనే స్త్రీలు తాము యిదివరకు గోల్పోయిన హక్కులను తిరిగి సంపాదించుకుంటున్నారు.

ప్రతిదేశంలోను గొప్ప రచయితలు స్త్రీలు పురుషులకన్న తక్కువస్థానం ఆక్రమించటము లేదనే వ్రాశారు. ఆంగ్లదేశీయులకు షేక్సుపియరు (Shakespeare) ఆదర్శ రచయిత. అతడు తన రచన లన్నింటిలోను స్త్రీని క్షమయొక్క అవతారముగా భావించాడు. ఈ విషయాన్నే గాంధీగారు తమ ఆత్మకథలో వ్రాశారు. "సేవకుని యజమాని అవమానిస్తే అతడుపనిలోనుండి మానుకొనవచ్చును. ఉద్యోగస్తునిపై పైఅధికారి ఆగ్రహించిన అతడు వెంటనే తనపనికి స్వస్తి చెప్పవచ్చును. కాని భార్యను భర్త అవమానించిన ఆమెబ్రతుకుపాడే."

స్త్రీకన్న శాంతం, ఓర్పు, పట్టుదల, జాలి, పురుషునకు లేదననీ; పురుషుడు కోపి, కఠినహృదయుడు, అనిన్నీ, పురుషులు క్లిష్టపరిస్థితుల్లో చిక్కుకున్నప్పుడు స్త్రీలే రక్షించారనీ ఆంగ్లనాటక గ్రంథకర్తయగు షేక్సుపియరు విన్నవించేడు. అతనినాటకాల్లో

ముప్పాతిక మువ్వీసము మర్చెంట్ ఆఫ్ వెన్నిస్‌లోగాని, రోమియో అండ్ జూలియట్‌లో గాని ఆదర్శవనితలుగా స్త్రీలే చిత్రింపబడ్డారు, కానీ పురుషులుకాదు. అందుచేతనే. రస్కిన్ (Ruskin) మహాశయుడు "షేక్సుపియరునకు వీరవనితలేగాని వీరులులేరు" (Shakespeare has no heroes; he has only heroines) అన్నాడు.

కృత్రిమం, కుళ్లు, గలస్త్రీలు అతనినాటకాల్లో లేరని అనటంలేదు. వున్నారు. వాళ్ల సంఖ్య, వ్రేళ్లమీదనే! గానరిల్, రీగాన్ (లియర్ నాటకంలో – King Lear) లాంటి స్త్రీలు షేక్సుపియర్ నాటకాలల్లోను, సంఘములో కొన్ని ఇళ్లల్లోను కలరు. షేక్సుపియరు మహాశయుడు ప్రపంచమందు వుండే మానవ స్వభావాలనన్నిటినీ తన నాటకాలవల్ల చిత్రింపచేశాడు. కనుక అతనిరచనలు సత్యభూయిష్టములై నేటికి కొనియాడబడటానికి కారణమైనవి.

మొగవాడు త్వరగా తొందరపడతాడనిన్నీ, అతణ్ణి దరిజేర్చేది స్త్రీ హృదయమేననిన్నీ ఆ మహాకవియొక్క ఆశయం. గొప్పగొప్పనవలలు వ్రాసినస్కాటు (Scott) మహాశయుడుకూడా స్త్రీలకు తక్కువస్థానం యివ్వలేదు. డాంటే వ్రాసిన పద్యంలోను ఛాసరు (Chaucer) వ్రాసిన కథలలోను స్త్రీల ఔన్నత్యాన్నిగూర్చి విశదపరిచారు.

కనుక స్త్రీలు, పురుషులయొక్క బానిసలుకారు. సేవకులుకారు. ఉత్తమస్థానం ఆక్రమించే స్త్రీకి ఎలాంటి విద్య కావాలన్నది తరువాత విషయం. ప్రకృతినిగూర్చి స్త్రీకి ముఖ్యంగా బోధించాలి. స్త్రీకి చరిత్ర అవసరం. ఈ విషయంలో ఆమెకు యుద్ధాలను గురించిగాని, తారీఖులను గురించిగాని చెప్పి బాధపెట్టకూడదు. ముందు తనదేశ చరిత్రను గూర్చిచెప్పి, విదేశాల చరిత్రలనుగూర్చికూడా కొంచంగా చెప్పితేచాలు. ఆమెకు భాషను గూర్చి చెప్పి ఎప్పుడు ఆమెను నిఘంటువుగా తయారు చెయ్యరాదు. పుస్తకాల్లో సామన్యంగా వాడే పదాలకు సరియైన అర్థంచేసుకోగలిగినంత చెప్పితేచాలు. ఆమెకు శాస్త్రం (Science) అవుసరం. పదార్థాలను గురించి, రసాయనములను గురించి కొంచెం చెప్పితేచాలు. మగవాని తెలివితేటలకన్న ఆడవాళ్లకు తెలివితేటలు హెచ్చు. కనుక కొంచెంచెబితే ఆమె అల్లుకపోగలదు. ఆమెను ప్రణయాన్నిగురించి, శృంగారాన్ని గూర్చి విశేషంగా చదువనీయరాదు. (?) నీతిబోధకమైన కథలను, పద్యాలనూ చదివించటం ఉత్తమం.

ఇక స్త్రీలు సంఘంలో చేసేపని యేమిటంటే మగవానికి చేదోడు వాదోడుగా వర్తించటమే. మగవాళ్లు కోపంగావున్నప్పుడు, ఆవేశంచేత చెడ్డపనులుచేస్తూ

వున్నప్పుడు వాళ్ళతప్పులను వాళ్ళకుచూపి, మంచిదారిలో పెట్టటం స్త్రీలధర్మం. పురుషుడు యింటిని రక్షించుకుంటూ, తనదేశాన్నికూడా ఎలాగు కాపాడుతాడో, స్త్రీకూడా అల్లే తనపని నిర్వర్తించుకుంటూ దేశసౌభాగ్యంకోసం పాటుపడాలి. స్త్రీలు తమవిధిని సరిగానిర్వర్తించుకోవటం లేదు గనుకనే దేశాల్లో యుద్ధాలు సంభవిస్తున్నాయి. దేశాల్లో యుద్ధాలులేవంటే స్త్రీలు తమ విద్యుక్తధర్మాన్ని బాగా ఆచరిస్తున్నారన్నమాట! కాబట్టి స్త్రీలే ఎప్పటికైనా దేశాన్ని రక్షించగలరు. దేశసౌభాగ్యాన్ని తీసుకురాగలరు. అందుచే ఆదర్శ స్త్రీలు పై ఆదర్శాలను మనస్సులోపెట్టుకొని తమధర్మాలను నిర్వర్తించుకుంటే ఏ దేశానికికూడా అసంతృప్తివుండదు.

# ★ వృథా





♦ నమ్మనిప్రభు సేవనమును
రమ్మనిప్రియమారఁ బిల్వరానికులజుడున్
నెమ్మదిమెచ్చని భర్తయు
ఇమ్మహిఁగల్గియును లేమియేయగునెపుడున్

♦ రాలుఁగరగించు సుమనోజ్ఞరాగములను
బధిరుచెంగటఁ గూర్చుండి పాడుటయును
పరములుబ్బని చెంగట మొరలువెట్టు
సర్థ మొరలును చెలియ; నిరర్థకములు

♦ వాసన లేనియట్టి ప్రసవంబులరంగు మెరుంగులున్ బుధా
వాసముగానియూరు రసవత్సరి హాసము లేని గోష్ఠియున్
గాసులు లేని అందమును గంతమనోజ్ఞత లేని గానమున్
భూసుర హీనమా వ్రతము భూస్థలిలో వృథయేను నెచ్చెలీ

♦ అర్థమెఱుఁగని చదువులు నాత్మశుద్ధి
లేనిపూజలు శాంతంబు లేనితపము
నుప్పులేనట్టికూరయుఁ గొప్పు లేని
కొమ్మరూపంబు వృథయనుకొమ్ము చెలియా

♦ బూడిదలో వేల్చుటయును
పాడింటను దీపమిడుట పాపాత్మునకున్
దోడన మేలొనరించుట
వీడుము వ్యర్థంబులనుచు వీనిని జెలియా

♦ నీతి లేనియట్టి నాతిరూపంబును ప్రీతిలేనివాని పెట్టుపోత
ఖ్యాతిలేనియట్టి ఘనతరపాండితి నేతిబీరకాయరీతి హృదయే
కారణము లేని వ్యసకాలమందు పంచపెట్టనిపైరులు ప్రౌఢవయసు
కాలమున లేనిసంతతి గల్గియుండి వృథలుగానెంచు మదిలోన నువిదనీవు

♦ చవటనేలను విత్తులఁ జల్లుటయును
ఉన్నవారికి దానంబులొసఁగుటయును
అరసియాకటికిడని మృష్టాన్నములను
పుష్పములేనిలతలును పోలు వృథయే

♦ పతిహీన యువతిజన్మము [బ్రతుకుల్
క్షితిమాతృహీనమైన శిశువుల
శృతిలేని గానసభ గుణ
పతిగానికుమారుఁగల్గి వ్యర్థము చెలియా

♦ గుణహీనుడైనపుత్రుడు గణహీనంబైనకవిత కవలాత్మునెదన్
ప్రణుతింపనట్టిజన్మము తృణసమముగ వ్యర్థమంచు దెలియుము చెలియా
రసికులు భళి రేయనుచను పసదనములొసంగనట్టి ప్రౌఢకవితయున్
పసిడిన్ గూర్చనిమణులును ఎనగంగా వృథయటంచు నెన్నుము చెలియా

♦ వృథ: గురువులేని విద్యలు [కూతున్
వృథయగు వృద్ధునకు నిడుచు పెండిలి

♦ వృథ కాడలేనిసత్తును [చెలియా
వృథయగుగృహలక్ష్మిలేని గృహములు

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు

♦ ♦ ♦




గర్భముధరించినది మొదలు మాతృగర్భములోని యీ యంధకార బంధురావాసమునుండి పిండము బయటపడువరకును వివిధదశలనుబొంది తుదకు పక్వమైనఫలముయొక్క తొడిమ దానంతటది వీడినటుల శిశువు మాతృగర్భమునుండి జన్మించును. ఆరోగ్యమైనబిడ్డలు సాధారణముగ పుట్టినతోడనే ఏడ్చుదురు. దీనివలన ఊపిరితిత్తులు వ్యాకోచించును. అందుచే 'బాలానాం రోదనం బలమ్' అని చెప్పబడినది.

తల్లి, బిడ్డను కనినతోడనే శిశువును జాగ్రత్తగా పట్టుకొని తగుమాత్రం వేడినీటిలో మురికిని బాగుగ కడిగి సబ్బుతోశుద్ధి స్నానముచేయించి మెత్తనివస్త్రముతో తుడిచి, దాది (Midwife) చేతులతో నిప్పు సెగనుగాచి బిడ్డ శిరస్సు, కడుపు భాగములకు వేడిగల్గునటుల పరుండబెట్టవలెను. పరిశుద్ధమైనవ్రేలితో ఆముదమును త్రాగించవలెను.

కొన్ని సమయములలో శిశువు జన్మించినతోడనే ఏడువక నుండుటగూడ సంభవించును. అప్పుడు మావిత్రాడును సవరించిన అందులోనివాయువు నాభిసూత్రముద్వారా గర్భములోప్రవేశించి బొందికి ప్రాణముచేరి బిడ్డ కదలును. బిడ్డను కదిలించి, వెచ్చనిచేతులతో రాయుట మూలమునను, చంటిబిడ్డ తుంట్లను మెల్లగ చరుచుటచేతను బొందియందు వాయువు ప్రవేశించి శిశువునకు ప్రాణము చేరుకొనును. పైపనులు బొడ్డుకోయకమునుపే చేయవలెను. శిశువునోటిలో ఆముదపువ్రేలునుంచి యూదుటవలనకూడ పిల్లలు ఏడ్చుటగలదు. మావిత్రాడుముడి, దానిలో జీవనాడి కొట్టుకున్నట్లగపడిన, ప్రాణము చేరుకొనువరకు, వేయరాదు. ప్రాణము చేరకుండ బొడ్డుత్రాడును ముడివేసి బొడ్డును కోయుట కుపకరింపరాదు. శిశువునకు చలనమున్నను, ప్రాణము చేకొనువరకు త్రాటిని సవరించవలెనేగాని ముడివేయరాదు.

బిడ్డ వెంటనే ఏడ్చుచు ఆహారమునకై పరితపించును. అప్పుడు హిందూసాంప్రదాయముగ రసకర్పూరము ఒకబేడ ఎత్తుగాని అడ్డఎత్తుగాని చూర్ణించి వంటాముదములో రంగరించి బిడ్డకు పట్టెదరు. తల్లి ప్రక్క శిశువును చేర్చుకొని స్తన్యమునీయ నలవాటు నేర్పింపవలెను. శిశువులకు తల్లిపాలే యాధారము. కొందరకు పథ్యమిచ్చినగాని పాలుపడవు. అట్టివారు అప్పుడే పితికిన ఆవుపాలిచ్చుట శ్రేయస్కరము.

శిశువు గల్గుటతోడనే తల్లికి వెంటనే పాలుపడును. ప్రారంభదశలోని పాలను ముఱ్ఱుపాలు యందురు. ఇది త్రాగిననేకాని బిడ్డకు విరేచన సాధకముకాదు. కొందరకు పాలు చేపకపోవును. అట్టివారు ఆరోగ్యవంతులగు చంటిబిడ్డతల్లుల పాలనుపిండి పోయించవలెను. లేక ఆరోగ్యవతులగు దాదులచే స్తన్యమిప్పింపవలెను. పాలదాది రోగపూరితయైనదైనచో దానిరోగములు శిశువునకంటును. దాదులలో

బిడ్డలు చనిపోయినవారు, సరియైనపథ్యము చేయరు. అందుచే బిడ్డలకు జబ్బుచేయును. దగ్గు, రొంప, మొ॥ వచ్చును. అందుచే కొందరు దాదులకింటివద్దే భోజనముపెట్టి ఉంచుకొందురు. పాలిచ్చు సమయములందు శుద్ధియగు వస్త్రములను ధరింపవలెను. పాలిచ్చు సమయములలో కోపముగాని విచారకరమైన తలపులుగాని మనసుయందు నుండరాదు. లేనిచో బిడ్డల యారోగ్యము చెడును. తల్లి పాలనిచ్చునపుడు శాంతముగను, సంతోషముగ మనస్సును నిర్మలపరచుకొనుటచే బిడ్డయానందముతో పాలుత్రాగి సుఖముగా నిద్రించుచుండును.

బిడ్డకు చనుపాలు లభ్యముకానిచో ఆవుపాలు శ్రేయస్కరము. తల్లికి పథ్యము పెట్టువరకే గుమ్మపాలు వాడుదురు. ఆవుపాలు చిక్కగనుండి జీర్ణముకానట్లు, ఆకలి మందగించి, పాలకై బిడ్డఏడ్వక, కడుపు పొంగినట్లుండినచో, ఆవుపాలలో మంచినీరు సమముగా కలిపి కాచవలెను. కాచునపుడు కొద్దిగ వామును మూటగట్టివేసిన పాలుపొంగి వామునందలిసారము పాలయందు కలియును. 2 లేక 3 నెలలుదాటిన పిల్లలకు పాలలో కొంచము పటిక పంచదారకూడ నుపయోగించవచ్చును.

అప్పుడే పితికిన ఆవుపాలనే వాడవలెను. పితికిన అరుగడియలలో కాచకుండిన వికృతిచెందును. నిలువయుంచి కాచిన జఠరవికారాది దోషములుగల్గును. రాత్రులందు నిలువయుంచి పిల్లలకు పట్టరాదు. అవి విషతుల్యములని ఎంచవలెను. మధ్యవయస్సుననుండు ఆవుపాలు మధురముగానుండి త్రిదోషహరమై యారోగ్యమిచ్చును. తొలిచూలుపాలు నిస్సారమును, గుణహీనమును కలుగచేయును. ముసలియావు పాలు దుర్బలము, తెల్లనిగోవుపాలు వాతహరము, కర్రిఆవుపాలు పైత్యహరము, ఎరుపుగోవుపాలు కఫహరము, కపిలగోవుపాలు త్రిదోషహరము, అనేక రంగుల గోవుపాలు పీనసమును గల్గించును. చిరకాలమునకు కాన్పుగల్గిన యావుపాలు ఉప్పగనుండి విదాహమును గలిగించును. సాధారణముగ యావుపాలు పుష్టి, బలము, కాంతి, ప్రజ్ఞ, బుద్ధి, వీర్యవర్ధనము గల్గించును. మేకపాలు వేడిచేయును. గాడిదపాలు ఉబ్బసపు రోగులకు ఔషధము.

జంతుపాలులేనపుడు డబ్బాపాలను కొందరు వాడుదురు. ఇవి పైదేశమునుండి దిగుమతియగును. నీరు కలుపుటలో నొకదినము ఎక్కువగుటయు, నొకదినము తగ్గుటయు వలన రొంపచేయుటగాని, పాలమొద్ద సారము తగ్గుటగాని జరుగును. అందుచే బిడ్డ ఆకలిచే మాటిమాటికి ఏడ్చుచుండును.

ఐదారునెలలు దాటినపిదప శిశువునకు నోట చొంగయూరును. శిశువునకు, తొమ్మిదవమాసము ప్రవేశించగనే తల్లిపాలు తగ్గ మొదలిడును. అందులకే బిడ్డలకు స్థూలాహారమలవాటు చేయుదురు. పండ్లు వచ్చుకాలమున కొందరకు నీళ్ల విరోచనములు, వాంతులుగల్గి జ్వరముకూడవచ్చును. దీనికి సాధారణముగ అవగింజంత నల్లమందును దీపముపైకాచి పాలతో మ్రింగించవలెను. సాధారణముగ నీరోజుల తర్వాతగాని, ముందుగాని 'అన్నప్రాశన' చేయుదురు.

శిశువులకు పాలుమాత్రమే ఇవ్వవలెను. ఇతరాహారములు పెట్టరాదు. ఇదియే మాంసమును, రక్తమును వృద్ధిచేసి బలమునిచ్చును. బిడ్డ ఏడ్చినపుడెల్ల పాలుపట్టరాదు. మధ్యకాలము ( Interval) 3 గం॥ యుండవలెను. విశ్రాంతిలేనిచో అతిసారము, అజీర్తి, వాంతులు గల్గును. నియమితకాలమున పాలుపోసిన వారు త్రాగి సుఖముగ పండుకొందురు. ఏడ్చినపుడెల్లపోసిన లేచినపుడెల్ల ఆహారమునకై ఏడ్చుదురు. అందుచే అది ఆకలిఏడుపో లేక నిజమైనఏడ్పో తెలియదు. 3 నెలలలోపు వారికి 3 గం॥ కొక పర్యాయము నివ్వవలెను. తల్లిపాలు 3, సం॥ వరకు త్రాగుదురు. సాధారణముగ 8, 9 నెలలలో దంతములు వచ్చును.

సంవత్సరము వరకు శిశువునకు నువ్వులనూనె పూయుచు ఉదయముననే వేడినీటిలో జలకమాడించుటచే శేతనరములకు సత్తువగల్గును. పెసలపిండిని, బావంచాలు అను ఒక విధమగు సువాసనగింజలు వైచి విసరి శిరస్సుకు దేహమునకు రుద్దినచో ఏవిధమగు చర్మవ్యాధి రానేరదు. ప్రస్తుతము వాసన సబ్బులను వాడుచున్నారు.

బాలారిష్టములు దంతములువచ్చు కాలములో కల్గును. శీతకాలములో తరుచు వచ్చును. జలుబు, జ్వరము, దగ్గు మొ॥ వచ్చును. ఇవి గాలిరాని చీకటి గదులందు చంటిబిడ్డలను పరుండబెట్టుటవలన గల్గును. బిడ్డలు కాళ్లు, చేతులు కదల్చుటే చక్కని పరిశ్రమ. 4 వ నెలలోనే బిడ్డలు సాధారణముగ బోర్లపడుదురు. 7, 8 నెలలు వచ్చుటతోడనే కండరములకు బలముగల్గి ప్రాకుట కుపక్రమింతురు. తరువాత మెల్లిగ నిలబడుచు నడచుటకు యత్నింతురు. సంవత్సరము దాటిన పిమ్మట రోజువిడచిరోజు అభ్యంగన మొనర్చవలెను. ఇట్లు శిశువును జాగ్రత్తగ చూచినచో మరి యేరోగములకు బాల్యదశ ఆరోగ్యముగానుండును.

---

# ★ సంసా — రనౌక ★

శ్రీమతి యం. ప్రసన్న కమలకుమారిగారు,

సంసారమనగా ఒక స్త్రీ, పురుషుడు కలసి స్వేచ్ఛానుసారముగా, ప్రేమానురాగముగా నడుపునటువంటి ఒక నౌక లాంటిది. యిది మహాప్రపంచకము అనునటువంటి మహాసముద్రమున నడుపవలసియున్నది.

ఈ నౌకను నడపుటకు స్త్రీ, పురుషుడు అనునటువంటివారు రెండు తెడ్లవలె నియమితులై యున్నారు వీరిద్దరు, కలసిమెలసి ప్రేమానురాగముగా సంచరించిననాడే ఈ నౌక "మహాప్రపంచకము" అను సముద్రమును ఈది ఒడ్డునకు చేరగల్గును. యిందు ఏ ఒకరయినను చీలినచో అది తుపానులాంటి బాధకు గురియై, శిథిలమై పోవుట తటస్థించును.

మన హిందూదేశాచార ప్రకారము మనవారు దీనిని "వివాహము" అను నటువంటి బంధనములచే బిగించియున్నారు. ఈ వివాహములలో మనవారలు ఎక్కువగా ఆచరించుచున్నది "బాల్యవివాహములు." యిందు వధూవరులకు యుక్తవయస్సు రాక మునుపే వారి తల్లి, దండ్రులు యిష్టతమీద వివాహములు గావించుచున్నారు. ఈ విధముగా వివాహము చేయబడినటువంటి నూతనదంపతులకు యుక్తవయస్సు వచ్చిన పిదప వారల (దంపతుల) మనస్సులకు మనస్పర్థలు ఏర్పడి ఎన్నియో కుటుంబములు కూలి, నశించిపోవుట మనకన్నులారా గాంచుచున్నాము దీనివలన వారల జీవితములే తల క్రిందులు అగుటయేకాక, స్త్రీ లోకమునకు పెద్దగొడ్డలిపెట్టు అయి బాధించుచున్నది. యిది యిటులుండ వివాహితలయినటువంటి స్త్రీలు మరల వివాహము చేసుకొనరాదు అను నటువంటి మరియొక నిబంధనగలదు. దీనివలన తల్లి, దండ్రుల యిష్టతమీద బాల్యవివాహమునకు గురియై, భర్తచే తిరస్కరింపబడ్డ స్త్రీయొక్క జీవితము ఏ రీతిగా కానున్నదో చదువరులే యూహించెదరుగాక ! వికసించిన యొకపుష్పము స్త్రీల యొక్క కురులయందున్నపుడే దానియొక్క శోభ విరాజిల్లుచుండును. అదేరీతిగా యుక్త వయస్కులై, శోభిలివంతులై యున్నటువంటి స్త్రీలు వారలయొక్క భర్తల చెంతనుండి సంసారము అనునటువంటి నావయందు తేలుచున్నపుడే వారలయొక్క శోభ ప్రకాశించు చుండును, అట్లుగాక భర్తలచే తిరస్కరింపబడినటువంటి స్త్రీలయొక్క ముఖవర్చస్సు

వాడిపోయినటువంటి పుష్పాకారమును పోలియుండుననుటలో యిసుమంతయు సందేహము లేదు. ఈ బాల్యవివాహములవల్ల ఒక స్త్రీ లోకమునకే కాక, అటు పురుషలోకమునకుకూడ కొంత బాధాకరముగానున్నది.

యిప్పుడు అనగా మనకు స్వాతంత్ర్యము లభించిన ఈ రోజులలోకూడ యిట్టి ఘోర, దురాచారములు జరుగుచుండుట మహిళాలోకమునకు పెద్ద గొడ్డలిపెట్టువలె బాధించుచున్నది. కాన ప్రస్తుతదినములలో ముందంజ వేయుచున్నటువంటి మనమహిళలందరు ఏకమై మనకు లభింపబోవుచున్న యితర హక్కులతోపాటు ఈ బాల్య వివాహములు అను చీడపురుగులను అతిసూక్ష్మమైన క్రిములతోబాటుగా నాశనమొనర్చుటకు సంసిద్ధులయ్యెదరని నేను విశ్వసించుచున్నాను.



# ఓ నారీ!



శ్రీమతి దీక్షి కామేశ్వరీదేవిగారు

నారీ - నారీ - ఓనారీ
లేవమ్మా
నీ - ఓరిమితో
ముక్కోటి దేవతల మూగవారిగ జేసే ||నా||

ఎంత కాలమీరీతిగ
వంటింట్లో యుంటావమ్మా ||నా||

నీవు లేనిదే
జగత్తు లేదని
ఉపనిషత్తులే
ఉద్ఘోషించాయ్ —
ఉల్లేఖించాయ్ ||నా||

మొల్లవై గంటము బట్టావ్
ఝాన్సీవై కత్తిని బట్టావ్
విజయలక్ష్మివై విజయము తెచ్చావ్ ||నా||

నీ శక్తికి
మించిన శక్తి
ఈ ఇలలో లేదమ్మా ||నారీ||

నాటిక




ఇందలి పాత్రలు :

లక్ష్మణుడు—నాయకుడు.

మునీశ్వరుడు-వశిష్ఠ శిష్యుడు.

భద్రుడు- మిథిలేశ్వరుని దూత.

కంచుకి-

కౌసల్య, కైక, సుమిత్ర-రాణులు.

ఊర్మిళ-నాయిక.

మాండవి, శ్రుతకీర్తులు - దశరథుని కోడండ్లు.

చతురికా, మంజులలు-ఊర్మిళ చెలులు.

దాసి-

(సీతారాములు, జనక వశిష్ఠులు మొదలగువారు ప్రస్తావింపబడుదురు.)

## 1 వ అంకము

సాయంకాల సమయము - స్థలము - ఊర్మిళా గృహోద్యానము.

(ఊర్మిళ శిలాఫలకముపై కూర్చుండి యెదుట నున్న పూవును యేకాగ్రతతో చూచుచుండును. చతురిక సమీపమున పూలనల్లుచుండును.)

ఊర్మి:-చతురికా! ఇటుచూడు. అస్తమింప బోవుచున్న దైనను ఈప్రొద్దు తిరుగుడుపువ్వు సూర్య కిరణ ప్రసారమున నెంతో మనోహరముగనున్నది.

చతు:-అవును దేవీ, మాణిక్యము మసిబారినను సహజ ప్రకాశమును వీడదుగదా!

ఊర్మి:-కనుకనే యిది సమయము తప్పిపోవుచున్నను సహజ సౌందర్యమును మాత్రము వీడకున్నది. ఆపూవును కోయుము.

చతు:-(లేచిపోయి పూవును కోయబోవును.)

ఊర్మి:-(ఖేదముతో) వలదు చతురికా కోయవలదు. ప్రియ విరహాముచే నింకొక క్షణములో వివశగా నున్నది. పాపము మనము దానినేల బాధింపవలెను.

చతు:- దేవిహృదయము వెన్నవంటిది. ప్రాణములేని పూలపైనైత మింత జాలియా!

ఊర్మి:- కాదు చతురికా! ప్రియవిరహ మెవ్వరికైన దుస్సహమేగదా? పాపము సూర్యుడస్తమింపగనే యిది మ్రాన్పడిపోవును.

చతు:- దేవీ సూర్యు డుదయింపగనే మరల యిది వికసింపగలదు. కష్టసుఖములు వెలుగు చీకట్ల వంటివికదా! దీనికై నీకింత విషాదమేల! (మాలికను ముగించి) ఇదుగో దండ కట్టుటయైనది. అలంకరింతునా! (లేచి తలపై సవరించును)

ఊర్మి:- విషాదముకాదు, గాని దీని ప్రసంగమ్మున మనసాక తీరుగ నైనది. ఏలనో!

చతు:- (నవ్వి) మనస్సును పదిలపరచు కొనుము దేవీ; ఇంతలో ప్రభువులు రాగలరు.

ఊర్మి:- సరిగాని చతురికా! జ్ఞప్తికి వచ్చినది. ఆర్యపుత్రులు స్వయముగా నాటిన సంపెంగ యెట్లున్నదో? దానిపై వారి కమిత వాత్సల్యము.

చతు:- మన్నింపుము దేవీ. నీకువిన్నవింప మరచితిని. అదియిప్పుడు మొగ్గదొడిగి రోజున కొకటి, రెండు పూలు పూయ దగినట్లున్నదని, నిన్ననే మన వనపాలిక చెప్పినది.

ఊర్మి:- (సంతోషముతో) అప్పుడే పుష్పోన్ముఖియైనదంటే ఆర్యపుత్రులు దానిని చూచిన ప్రియ ముందుదురు.

చతు:- ఈ మావిమోక కావలనేయున్నది. దానిని సమీపమున చూతువా దేవీ.

ఊర్మి:- ఆర్యపుత్రులతో కలసియే దానిని చూతును. ఈపాటికి వచ్చియే యుండవలసినది. నేడేలనో ఆలస్యమైనది.

లక్ష్మ:- (దూరమున కనపడును.)

చతు:- (చూచి) దేవీ! అదుగో చూడుము. కుమార లక్ష్మణులు మాటలలోనే వచ్చినారు. నేనిక్కడనే పూవులు కోయుచుందును. (పోవును)

లక్ష్మ:- (దగ్గరకు వచ్చును.)



ఊర్మి:- జయమార్యపుత్రులకు. కూర్చుండుడు. నేడింత యాలసించితిరేమి?

లక్ష్మ:- (కూర్చుండి) నేడు సభాభవనమునకేగితిని. ఒక ప్రసంగము జరుగుచుండుటచే కొంత యాలస్యమేయైనది. అయినను, అది ప్రియమైనది. (ప్రీతి విస్ఫారిత నేత్రములతో చూచి) ప్రియమును చెప్పమందువా? చెప్పిన నేమిత్తువు?

ఊర్మి:- ఏమట్లు ఒడలంతయు కన్నులు చేసికొని చూచుచున్నారు? అంతప్రియమైన విషయమేమై యుండునో, చెప్పుడు.

లక్ష్మ:- నీవు ఒడలంతయు చెవులుచేసుకొని వినవలసినంత ప్రియమైన విషయమది. చెప్పిన నాకేమిత్తువో ముందుచెప్పుము.

ఊర్మి:- చెప్పుడు. దానికుపాయనముగా నేను మీకొక ప్రియమును జెప్పుదును.

లక్ష్మ:- నేడు జనకులు సభాభవనమునుండి అగ్రజునభిషేకింప వలయునని తలవని తలంపుగా సంకల్పించినారు. ఈవిషయ మెరిగించుటకే మమ్ము పిలిపించినారు. ఇప్పుడే రాజ్యభారము వహింపవలయునని లేకున్నను వశిష్టాదు లనుమతించుటచే నార్యుడు దీని కంగీకరించినాడు. రేపే సుముహూర్తము.

ఊర్మి:- (ఉత్సాహముతో) ఇది శుభవార్తయే. కాని యింత అవ్యవధిగా నెట్లుజరుగును?

లక్ష్మ:-(నవ్వి) పెట్టెదానా వ్యవధి యున్ననేమి, లేకున్ననేమి? రాజాజ్ఞచే క్షణములో నెట్టికార్యమైనను జరుగగలదు. సుమంత్రాదు లప్పుడే పరికర సేకరణమున నిమగ్నులైనారు.

ఊర్మి:-సరి. మీరింక శ్వేతఛత్ర ధారులగుదురు. మా అక్క రేపటినుండియు సాకేతరాజ్యరమకు సపత్ని కాగలదు.

లక్ష్మ:-ఇవి మనకు చిరకాలాభిలషితములగు కోర్కెలు.

ఊర్మి:-కోర్కె లటుండనిండు కాని, ఆర్యులు పట్టాభిషిక్తులగుచుండ మాళవీ పతియును, శత్రుఘ్నకుమారుడును లేకుంట నెట్లుజరుగును?

లక్ష్మ:-నీమాట నిజమే, ఈమాట అందరి హృదయము లందును నుండియే యుండును. కాని ముహూర్తము రేపే యగుటచేతను, వారు దూరమున నుండుటచేతను వశిష్ఠాదు లేకగ్రీవముగ నంగీకరించిరే కాని వారివిషయమునే ప్రస్తావింపలేదు.

ఊర్మి:-సరిలెండు. విధి నిర్ణయమెట్లున్న నట్లు జరుగును. నేను ప్రియమును జెప్పుదునా?

లక్ష్మ:-చెప్పుము. ఎట్టిదా ప్రియము?

ఊర్మి:-మీరు నాటిన సంపెంగ పుష్పిణియైనదట.

లక్ష్మ:-(ఆశ్చర్యముతో) అప్పుడేనా! అయిన చూతము పద.

ఊర్మి:-చతురికా! సంపెంగను చూడవలయును.

చతు:-(ప్రవేశించి) ఇటు, ఇటు, దేవీ.
(చతురిక దారిచూపును. తెరలేవగా సంపెంగ కానవచ్చును.

ఊర్మి:-ఈసంపెంగ గున్న గుబురుగా నెదిగి యవ్వనవతివలె రమణీయముగ నున్నది.

లక్ష్మ:- పుష్పించినట్లు లేదు. గాని, యేదో యొక సుగంధము మాత్రము నన్నాకర్షించుచున్నది. ఒక్కపూవైన లేకుండునా చూడు చతురికా.

చతు:-(వెదకి)ఇదిగో! ప్రభూ ఒకపువ్వీచ్చట బాగుగ విచ్చినది. (కోసి లక్ష్మణున కీయబోవును)

లక్ష్మ:-(గ్రహింపక దేవినిజూపును) కాన్కలందుట కర్హులు వారు.

చతు:-(దేవికిచ్చును.)

ఊర్మి:-(గ్రహించి) ఇది తొలికుసుమము. మీకు దీనిపై ప్రీతిమెండు. దీనిని మీరే గ్రహింపుడు. (లక్ష్మణున కిచ్చును.)

లక్ష్మ:-(తీసికొని) సద్గుణమువలె సౌరభము దాచినను దాగదు.

ఊర్మి:-ఆర్య పుత్రుల కన్నిటికన్న దీనిపై యింత ప్రీతి యేలనో?

లక్ష్మ:-పుష్ప జాతులలోకెల్ల శీలసంపదచే నిది మిన్నయైనది. కనుకనే నాకిది ప్రియమైనది. దీనితో నీవేణి నలంకరింతును. (అట్లుచేసి) చతురికా, యింకను కలవేమో చూడుము.

చతు:-(వెదకి) లేవుప్రభూ. ప్రొద్దున పూయదగినవి కొన్ని మొగ్గలు మాత్రమున్నవి.

ఊర్మి:-అయిన వీనిని భర్త్రు పూజా సమయమునకు తెప్పింపుము.

చతు:-దేవియాజ్ఞ.

లక్ష్మ:-(కొంటెగా) చతురికా! దేవియలంకారమున వీని నుపయోగింపుము.

చతు:-దేవర యాజ్ఞ.

ఊర్మి:-ఆర్యపుత్రులు వాక్చతురులు. గాని సూర్యభగవాను డస్తమించినాడు. మందిరమున కేగవలదా?

లక్ష్మ:-అవును దేవీ. నే నిప్పుడు సోదరునికడ కరుగవలయును. చీకటి యలముకొనుచున్నది. మీరు మందిరమున కేగుడు. (వెడలి పోవును)

చతు:-దేవీ! మనకీ నవమాలికలే మార్గమును జూపుచున్నవి. పోవుదమురమ్మ.

( తెర )



# స్త్రీలు అబలలా?






ఏం! స్త్రీలు అబలలా! ఎవరంటారు? అదంతా కల్లయేనని నేనంటాను. స్త్రీలకు మాత్రము శక్తి సామర్థ్యాలు లేవూ? వాండ్లుమాత్రము సృష్టిలో శ్రేష్టులు కారూ? "స్త్రీలు అబలలూ! వారికేమి చేతకాదూ!" అంటారు పురుషులు. ఇలా తూలనాడే పురుషులు మాత్రము నీతిమంతులా? బలవంతులా? వాండ్లుమాత్రము నీచకార్యాలకు పాలుపడడం లేదూ? వారు మూడు వేళల యిష్టానుసారముగా భుజించి జబ్బులు పెంచుకోవడం లేదూ? ఏం సుఖము? మన చిన్నయసూరేగా చెప్పింది మిత్రభేదములో; "మానసిక బలము మహోత్కృష్టమైంద"ని. ఆమాత్రము తెలుసుకోలేమూ? తనకున్న కండరములు చూచుకుంటూ, గర్వించి ఒండొరులతో పోరుచూ, చీట్లాడుచూ, హాత్యలు చేసుకొంటూ, సకలసౌఖ్యాలని అనుభవించుటకుతప్ప దేనికిపనికివస్తారు? పైగా, వీరులమంటూ, దేశాభిమానులమంటూ ఘోరయుద్ధములోగూడా ప్రవేశింపలేదూ మన వారంతా? పాపము అక్కడమాత్రము శాంతివుండా మనవారికి? ఎప్పుడు సందుదొరికితే అప్పుడు పారిపోవడము మారువేషాలతో, సన్యాసుల్లాగా దేశదిమ్మరులై తిరగడము లే? ఏం! ఈవీరత్వము లేకుంటే? ఇంట్లోకూర్చుని దొరికినదాంతో తృప్తిపడకూడదూ? మరి కొందరు యిల్లాల్నికూడా పోషించలేక యుద్ధములో ప్రవేశించారు మేమొకవీరులమని. ఇదేనా వీరత్వమూ! ఇదంతా యెదుకూ? ఇంట్లోకూర్చుని నాచేతకాదంటే భార్య బ్రతికించదూ? అంతమాత్రము స్త్రీలకు శక్తిలేదనుకున్నారా? అదీనిజమే! పురుషులు స్త్రీలపై ఆధారపడడంకన్న మించిన అవమానము యింకేముందీ? అయితే ఏం చేద్దాం? అలాచేసే వారికి ఆ గతి యెప్పటికైనా తప్పదు.

అది అట్లుంచండి. స్త్రీలుమాత్రము వీరులు కాదనుకొన్నారా? అటొకతూరి చూడండి, ఆపడమటి దేశాలకెళ్ళి, ఎందరు స్త్రీలు యుద్ధములో పాల్గొనుచున్నారో? ఏడకో ఎందుకూ? మనదేశములోనే ఝాన్సీరాణి లక్ష్మీబాయి, రాణీ మీరాబాయి, జేబున్నిసా, పల్నాటి నాయకులు, మగువమాంచాల మొదలగువారు పురుషుల్ని తలదన్ని రాజ్యాలను యేలలేదూ? వీరత్వాన్ని వెదజల్లలేదూ? ఏం! అప్పుడే మరచిపోయారా?

మనమందరము చదువుచున్న విషయమేగా? జోనఫ్ఆర్క్ కన్య, దుర్భర పతనావస్థలో మూల్గుతున్న ఫ్రాన్సుదేశంలో వుత్సాహం పురికొల్పి వీరవనితయై విజృంభిస్తూ విజయాన్ని చేకూర్చలేదూ? బ్రహ్మనాయకుడు మనవాడేగా? అట్టివాడు నలగామరాజు ఆ అబల, ఆ స్త్రీ నాయకురాలి చేతిలో కీలుబొమ్మలై కూర్చోలేదూ? అంటారు. మనవారు "మీకేం తెలుసు వంటవండడం, పిల్లల్ని కనడం తప్ప" అని జబర్దస్తీ చేస్తారు. ఎక్కడ చెప్పండి మనవారు ఆడవారిలాగా వంటచేయకుండ వున్నది? ఒక స్త్రీ ఆఫీసరు అయిందంటే ప్రక్కనే వుంటారుగా మనవారు వంటచేయడానికి, వస్తువులు మోయడానికి. స్త్రీకి స్వేచ్ఛ లేదంటారు. ఎక్కడుంటుంది? స్త్రీ స్వేచ్ఛగా అలా వెలువడిందంటే యిక తయారౌతారు చూడు మనవారు; బ్లేజర్ సూటు, బూటాబూటు, పెవర్ లో బా రిష్టువాచీ, కండ్లకు స్పెట్సుతో గోలచేయడానికి. ఇందుకే గదూ పూర్వులన్నారు "బెల్లమున్న చోట ఈగలుమెం"డని. ఎప్పుడైనా నల్గురితో పాటు నారాని కొకసారి స్త్రీలు ఏ చర్చికో, సినిమాకో, రాజకీయాలు వినగోరి ఏ సభకో బయలు దేరారంటే అబ్బా? ఒకటే గోలా? వీరిసొమ్ము మునిగిపోయినట్లు ఒకటే చూపు నిగడ్చడం. బాగానే వుంది వ్యవహారం. స్త్రీలు లేకుంటే పురుషులకు కులాసా ఏముంది? పెట్రోలులేని ఇంజనన్నమాటే.

మనదంతా దౌర్జన్యమా? అన్యాయమా? ఎందుకో మనమంటె అంతచౌక? "మగవారిని నమ్మరాదే చెలీ!" అని ఒకప్రక్క బెజవాడ రాజరత్నం పాడుతునే వుంది దేవతలో. మనవారింకా తెలుసుకోకపోతే, చెప్పితేమాత్రము ఏమి తెలుస్తుంది? మళ్ళా మనవారు ఎప్పుడూ వాకుతూనే వుంటారుగా "ఆడబ్రతుకే మధురం" అని పాటల్లో. అలాంటపుడు వారినెందుకు తూల్నాడాలి? వారిని వున్నత దశలోనికి రాకుండ చేస్తుంది మనమే. లేకుంటే వారెట్లు అబలలౌతారూ?



శ్రీమతి బి. సరోజినీదేవిగారు

# వాగ్దానము



వెంకయ్యా మేలువేళ అయింది. అబ్బాయి వస్తాడు. కారుతీసుకొని స్టేషన్కి వెళ్ళు అనిచెప్పి రాజేశ్వరమ్మ యింట్లోకి వెళ్ళిపోయింది. అప్పుడే మెట్లు ఎక్కుతున్న సరళ ఆమాట వింది. రాజేశ్వరమ్మ లోపలకి వెళ్ళిపోగానే వెంకయ్యా స్టేషనికి ఎందుకు? ఎవరు వస్తారు? సుధాకరబాబుగారు వస్తారండి, అంటూ వెంకయ్య కారు తీసుకొని స్టేషన్కి వెళ్ళిపోయాడు. సరళ లోపలకి వెళ్ళింది. రాజేశ్వరమ్మ, సరళను చూచి 'రా అమ్మా లోపలికి. మీ అమ్మ కులాసాగవున్నదా?' 'కులాసాగానేవున్నది అత్తయ్యా?' 'మీ అక్క ఏమిచేస్తోంది? ఈ సంవత్సరము పెండ్లిచేస్తారా?' 'నాన్నగారు సంబంధాలు చూస్తున్నారు. మంచి సంబంధము వస్తే చేసేస్తారు.' 'మా సుధాకరునకు ఈ సంవత్సరముతోటి చదువు పూర్తిఅయి పోయింది. వాడికి సంబంధముచూచి పెండ్లిచేస్తాము.' 'ఈరోజు సుధాకరబాబువస్తారా?' 'అవును. ఇప్పుడు మేలులో వస్తాడు. ఏదో పనిమీద వచ్చినట్లువున్నావు.' 'ఏమీలేదు అత్తయ్యా! ఇంట్లో ఏమీతోచక వచ్చాను. ఇంక వెళతాను' అంటూ సరళ యింటికి వెళ్ళిపోయింది.

కాకినాడ డిప్యూటీకలెక్టరు రామారావుగారి కొడుకు సుధాకరుడు. విశాఖపట్నంలో ఎమ్. బి. బి. యస్. ప్యాసయి వచ్చాడు. సుధాకరుడు చాల అందమయిన ముఖము, నల్లటి నొక్కు, నొక్కుల క్రాపింగు, అందానికి తగ్గ వినయము అన్నీ అతనిలో మూర్తీభవించి యున్నాయి. 'ఏం నాయినా ఇంక నీచదువు పూర్తిఅయినట్లేనా?' 'ఈసంవత్సరముతోటి పూర్తిఅయిందమ్మా.' 'ఇంక నీ పెండ్లి చేసి, నిన్ను, కోడలిని చూచుకొని సంతోషముగావుండడమే నాకు మీ నాన్నగార్కి నాయనా' 'ఇప్పుడు పెండ్లి కేమి తొందర వచ్చిందమ్మా? ఇంక ఇప్పుడేకాదు చదువు పూర్తి అయింది. నాకు గవర్నమెంటు వుద్యోగము చేయుట ఇష్టములేదు. ప్రాక్టీసు పెట్టాలని వున్నది. అది అంతా పూర్తి అయిన తరువాత చేసుకొంటాలే అమ్మా.' 'అదేమిట్రా అలా అంటావు. మామకూతురు సరోజిని నీకు ఇచ్చుటకు అంతా సిద్ధమయింది. నేను మాటకూడ ఇచ్చాను. అది అయినా ఎఫ్. ఎ. చదువుతోంది.' 'నేను సరోజను చేసుకోనమ్మా.' 'శలవలలో దాన్ని ఇక్కడకు పంపమని వ్రాశాను. అయినాచూచి నీవు చాల రోజులయింది. దాన్ని ఒక్కసారి చూస్తే నీవే చేసుకొంటావు.' వీరిద్దరు మాట్లాడుకొంటూ వున్న సమయంలో సరళ అక్కడకు వచ్చింది. సరళను చూచి రాజేశ్వరమ్మగారు మాటమార్చి 'రా అమ్మా సరళా! నాన్నగారు ఊళ్ళో ఉన్నారా?' 'లేరు అత్తయ్యా. ఈరోజు రాజమండ్రి వెళ్ళారు.' అక్కడ కూర్చున్న సుధాకరుని చూచి సరళ వెనక్కి వెళ్ళిపోయింది. 'రా అమ్మా వాడిని చూచి సిగ్గు ఎందుకు?' సుధాకరుడు సరళయొక్క రూపురేఖలు చూచి ముగ్ధుడయ్యాడు. ఆమె తననిచూచి సిగ్గుపడుతోందని తను గదిలోకి వెళ్ళిపోయాడు. 'మీ అక్క రాధ మాయింటికి వచ్చుట మానివేసిందే.' 'రెండు రోజులనుండి జ్వరముగావుంది. అందుచేత వచ్చుటలేదు. మీరుమాటలలో వున్నారు. సాయంత్రమువస్తాలే అత్తయ్యా' అంటూ సరళ వెళ్ళిపోయింది. సుధాకరుడు బయటకు వచ్చి 'ఎవరు అమ్మా ఆ అమ్మాయి.' 'ఈవూరు హైస్కూలు హెడ్ మాష్టర్ గారమ్మాయి. మనయింటి దగ్గరనే వాళ్ళయిల్లు. రోజు ఒకసారి మన యింటికి వస్తుంది. వంట అయింది భోజనము చేదువు గాని రా నాయినా!'

కాకినాడ హైస్కూలు హెడ్మాష్టరు సత్యనారాయణగారు. ఆయనకు ఇద్దరే కూతుళ్లు పెద్దపిల్ల రాధ; చిన్నపిల్ల సరళ. రాధ స్కూలు ఫైనలు దాకా చదివింది. ఇంక పెండ్లి చేద్దామన్న ఉద్దేశ్యముతో చదువు

మానిపించేశారు. సరళ స్కూలు ఫైనలు చదువుతోంది. రాధకన్న సరళ అందములోను, బుద్ధిలోను, వినయ విధేయతలలోను అన్నిటికి అక్కని మించినది. రాధ అంత ఎక్కువ అందమయినది కాదు. అనూయపరు రాలు. కాని పైకి వెంటనే తేలదు. ఎక్కడనుంచో వస్తున్న చెల్లెలనుచూచి 'ఏమే రోజూ పెత్తనాలు ఎక్కువ అవుతున్నాయి. శలవలిచ్చిన దగ్గరనుంచి ఆ రాజేశ్వరమ్మగారి యింట్లోనే వుంటున్నావే?' 'ఏంలేదు అక్కా తోచక వెళ్లాను.' 'ఆమెతో నీకు కబుర్లు ఏమిటే? సరేలే ఈరోజు "మేలా" సినిమా చాలా బాగుంటుంది. మనమిద్దరం వెళదాము.' 'వస్తానక్కయ్యా!' సినిమాకు ఇద్దరు బయలుదేరారు. కాని ఆరోజే విడుదల అవుటచేత స్త్రీలకు ప్రత్యేక స్థలములేదు. సరళ మనస్సు సుధాకరుని చూచినప్పటినుండి అదోక మాదిరిగావుంది. సుధాకరుడు గొప్పవాడు. తనని ఎందుకు పెండ్లిచేసుకొంటాడు. ఈ ఆలోచన లతో అక్కతోటి ఒక్క మాటఅయినా మాట్లాడలేదు. ఆడవాళ్లకు టిక్కెట్లులేవని చెప్పగానే రాధకు యింటికివెళ్లను బుద్ధిపుట్టలేదు. మొగాళ్లలోనే వెళ్లి కూర్చున్నారు. ఆట మొదలుపెట్టేరు. సరళ కుర్చీప్రక్క ఇంకెవరో ఒక అతను వచ్చి కూర్చున్నాడు. సరళ అసలే భయస్తురాలు. అతన్ని చూచి బెదిరిపోయింది. 'అక్కా ఈరోజు సినిమాకు వచ్చుటంత బుద్ధితక్కువపని మరియొకటిలేదు.' 'ఏమొచ్చిందే! మొగాళ్లలో ఎంతమంది ఆడవాళ్లు కూర్చొనుటలేదు.' ఇంతట్లోకి యింటర్‌వెల్ అయింది. లైట్లు అన్నీ వెలిగాయి. తన ప్రక్క కూర్చున్న వ్యక్తి ఎవరా అని సరళ ప్రక్కకిచూచింది. ఇంకెవరు? తను ఎవరినిగురించి ఆలోచిస్తున్నదో అతనే; సుధాకరుడు. ఆ సమయానికే అతను ఆమెకేసి చూచాడు. ఇద్దరిచూపులు కలిశాయి. సరళ చాల సిగ్గుపడిపోయింది. అదే సమయములో రాధ అతనికేసి చూచి అతని అందమునకు చాల ముగ్ధురాలయింది. ఆట అయిపోయింది. అందరు యింటికి బయలుదేరారు. 'సరళా నీప్రక్కన కూర్చున్న వ్యక్తి ఎవరోకాని చాల అందమైన పురుషుడు. పెండ్లిచేసుకుంటే అలాంటి వానిని చేసుకోవాలి.' ఆ మాట వినే సరికి సరళహృదయములో ముల్లుగ్రుచ్చుకొన్నట్లు అయింది. 'అక్కా అతను ఎవరోకాదు. రాజేశ్వరమ్మగారి కొడుకు సుధాకరుడు.' ఆ! ఏమిటీ, వాళ్ల అబ్బాయా? నీకు అప్పుడే అన్నివివరాలు తెలిశాయే.' కబుర్లుచెప్పు కొంటూ వాళ్లు యిల్లుచేరారు. ఆరాత్రి సరళ, రాధలకు నిద్రపట్టలేదు. ఇద్దరు సుధాకరుని గురించేఆలోచన.

'సరోజ! భోజనానికిలే తల్లీ!' 'బావకూడరానీ అత్తయ్యా!' 'వాడు అప్పుడేరాడు నీవురా!' 'ఎందుకులే ఇద్దరము ఒక్కసారి తింటాము.' అప్పుడే షికారునుంచి సుధాకరుడు వచ్చాడు. రాగానే ఎదురుగుండా వున్న సరోజనినిచూచి ఏమి మాట్లాడించకుండా మేడమీదకు వెళ్లిపోయాడు. 'సరోజ మీబావను భోజనానికి పిలు అమ్మా!' అనగానే సరోజ మేడమీదకు వెళ్లింది. సుధాకరుడు కుర్చీలో ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆమె మెల్లగా బావా.అంటూ భుజం మీద చెయ్యివేసింది. అతను తుల్లిపడి వెనక్కి చూచి 'ఓ! సరోజ నీవా కూర్చో.' 'అదేం బావ నన్ను ఆన వాలు పట్టలేదా?' 'ఆ పట్టకేం! భోజనం చేద్దాము. పద' అంటూ అక్కడ ఒక్క క్షణం అయినా కూర్చోకుండా క్రిందకు వచ్చేశాడు. భోజనాలు అయి మేడమీదకువెళ్ళి పడుకొన్నాడు. కాని అతని బుద్ధి ఆలోచనలతో నిండిపోయింది. 'సరోజనా నేను పెండ్లి ఆడుట. ఆ చీర కట్టు, సినిమా ఫ్యాషన్‌గా దువ్వుకొనుట, ముఖమునకు బొట్టులేకుండగా. ఛీ అంతా సినిమా ఫేషను ఎంత చదువుకొన్నా ఇటువంటి పాడు పోకుల? సరళ ఎక్కడ? సరోజ ఎక్కడ? ఏమయినాసరే సరోజను చేసుకో లేను.' ఇంతట్లో ఎవరో తలుపుతీసి వస్తున్నట్లు అలికిడి అయింది. ఎవరా అని లేచిచూచాడు. ఇంక ఎవరు సరోజ! 'ఏం బావ అప్పుడే నిద్రరేదా?' 'అవును. సరోజ నిద్రవస్తుంది. పడుకోవాలి.' 'అదేమిటిబావ! అలా అంటావు. నీతో సరదాగ కబుర్లుచెప్పుకుంటూ నీ దగ్గరపడుకోవాలని వచ్చాను.' 'నీకేమైన మతిపోయిందా సరోజా; ఈడొచ్చిన వాళ్లము. ఈ అర్ధరాత్రిసమయం ఒక్కచోట పడుకోవచ్చునా?' 'అదేమిటిబావాచదువు కొన్నవాళ్లకు ఇటువంటి పిచ్చులు. మనయిద్దరికి పెండ్లి అవుతుందికదా! ఒకచోటవుంటే తప్పేమిటి?'

—; ♦ :—

(సశేషము)

# ★ "లలిత కళలలో 
# ★ కవిత్వమునకు గల స్థానము"

* * * శ్రీమతి వి. సరోజినిగారు * * *

ఆనందరస స్వరూపుడైన ఈశ్వరునియందు రూపపిపాస కలదు. అతడు కేవలము నిర్గుణుడైనచో ఈ సృష్టికి తావేలేదు. విద్యలకును, కళలకును ప్రయోజనము కాని, సార్థకత కాని యుండదు. మానవునియందుగూడ ఈ రూపలాలస ప్రతిబింబించుచున్నది. ఈశ్వరుని ఆనందరస మెప్పుడును భోక్తృ భోగ్యరూపముల విచిత్రగతుల విచిత్రలీలల విచిత్రరసముల చిందుచుండును. ఆతని యందున్న ఈ బహురూప సమృద్ధియే మానవుని యందుకూడ నిహితమైయుండి సకల కళలను విద్యలను పురిగొల్పుచున్నది. ఈశ్వరుని సృష్టి మానవరచనయందు చరితార్థతను పూర్ణతను పొందునప్పుడే సృష్టిరహస్యము బుద్ధిగోచరమై కళల ప్రయోజనము గ్రాహ్యమగును. విశ్వకవి, మానవుని జిహ్వాగ్రమున నివసించి వాణీరూపమున నృత్యముచేయుచు సకలకళలను విరజిమ్మును. అర్థవాణిజ్య పరిశ్రమాదులు పదార్థముల వ్యావహారిక ప్రయోజనమును తెలుపును. కాని కళలయొక్క లోతు, పాతుల ప్రయోజనమును తెలుపవు. వ్యావహారిక విషయములచే బరివేష్టింపబడియున్న, దుఃఖమయమైయున్న మానవహృదయ మెప్పుడును ఆనందమును, సుఖమును గూర్చు కళలవైపునకే మ్రొగ్గియుండును. ఈ కళలలో కవిత్వమునకుగల ప్రాధాన్యము విచారింతము.

కళలలో అనేక రకములు కలవు. అందు లలితకళలు నాలుగువిధములుగా విభజింపబడినవి. కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము, విగ్రహశిల్పము మొదలగున వీ శాఖకు చెందినవియే. మరియు ఈ నాల్గింటిలో కవిత్వము, సంగీతము చర కళలుగాను, చిత్రలేఖనము, విగ్రహశిల్పము స్థిర కళలుగాను నిర్ణయింపబడినవి. స్థిరకళలకంటె చర కళలుత్తమమైనవి,

విగ్రహ శిల్పమునకు వస్తువు, పరిమాణము వీనికి తోడు శిల్పియొక్క నేర్పరితనము, చాకచక్యము కావలెను. శిల్పి వస్తువును ముందిడుకొని తన నేర్పరితనమును అందు మిళితము చేసి మనకానందము కలిగించు విగ్రహమును చెక్కును. ఇందు భౌతికద్రవ్యాపేక్ష మిక్కుటముగ నుండును. మానవుడు విగ్రహముయొక్క బాహ్యరూప సౌందర్యము వలననే ఆనందమును పొందగలుగుచున్నాడు. కాని ఈ ఆనందము స్థిరముగ వాని హృదయమున నిలువజాలదు,

చిత్ర లేఖనము కూడ నింతియే. చిత్రకారుడు ప్రకృతిని చిత్ర విచిత్రములైన రంగులతో హృదయానందకరముగ చిత్రించును. ఇదికూడ శిల్పకళవంటిదే. చిత్రకారుడు తన భావస్ఫురణచే చిత్రించును. మన మా చిత్రమును ప్రత్యక్షముగ చూచుచున్నంతవరకు మాత్రమే ఆనందమధువు మన హృదయమున పొంగిపొరలును. ఆ చిత్రమును చూడగనే మన కొక్క భావమే స్ఫురించును. అతడొక వ్యక్తిని చిత్రించినప్పుడు ఆ వ్యక్తి విచారముగనో, సంతోషముగనో, నవ్వుచున్నట్లో, ఏదో ఒక్క భావమునే మనకు స్ఫురింపజేయును.

ఇంక సంగీతము. భౌతిక ద్రవ్యాపేక్ష విషయమున కవిత్వము, సంగీతము రెండును సమానములే. కవిత్వమునకు భావము ప్రధానము. సంగీతమునకు కంఠస్వరము ప్రధానము. గాయకుడు వాద్యములే తనపరికరముగ గ్రహించి తనగాత్రమును దానితో మేళవింపజేసి పాడును. ఇంక, కవి తన మృదు, మధుర శబ్దములకు భావమునే పరికరముగ గ్రహించి కావ్యమును వ్రాయును. కాని సంగీతముకంటె కవిత్వమే ఉత్తమమైనది. సంగీతమునందు మృదుమధుర, శబ్దములు, రసోత్పత్తి, భావనాస్ఫూర్తి మొదలగు కవితాలక్షణము లన్నియు ఉన్నవి. అందును శ్రవణానంద కరములగు మృదు, మధుర శబ్దములకొరకు సంగీతము కవిత్వముపై ఆధారపడియున్నది. విద్వాంసులు 'శిశుర్వేత్తి పశుర్వేత్తి గానరసం ఫణీ" యని నిర్వచించిరి. సంగీతమునందలి రసమును పశువు సహితము గ్రహించగలదు. అదియే కవిత్వముకంటె ఉత్తమమైన దని నిర్ణయించినచో పశువునకు మానవునకు భేదమే లేదు. పశువుకంటె మానవు డుత్తమజాతికి చెందినవాడగుటచే పశువుగ్రహింపజాలని ఆనందమును, జ్ఞానమును ఉత్తమకావ్యములనుండి గ్రహింప నర్హుడు. కవిత్వము, సంగీతముకంటె మిన్న యనుట కివియే కారణములు.

## 'లలిత కళలలో కవిత్వమునకుగల స్థానము'

గృహలక్ష్మి

ఉత్తమ కావ్యమునందు దోష రహితము, గుణసహితము, రస పుష్కలము కలిగిన శబ్దార్థము లుండును. త్రికాల జ్ఞానము, సౌందర్య బోధము, ఆనందరస నిమగ్నత, అతీంద్రియ స్పర్శానుభూతి యగు నీ నాలుగు లక్షణములు లేనిది ఉత్తమ కావ్య రచన యసంభవము. కవిత మానవుని దృష్టిని వాస్తవ జగత్తునుండి పైకి ఆకర్షించి వాస్తవము వెనుక నున్న యదార్థమును, సత్యమును వెల్లడించును. కవి తన గంభీర చేతస్సునందలి బంగారు రూపములను వెలిబుచ్చునని వేదము చెప్పుచున్నది. అతడు కేవలము ద్రష్ట. తార్కికునివలె తర్కించడు. అనుమానముచే నూహించడు. ఇంద్రియములిచ్చు జ్ఞానముతో తృప్తి నొందడు. వాని నేత్రము సూర్యునివలె చాటు చోటుల నన్నింటిని ప్రకాశింపజేయును. అతడు సర్వజ్ఞుడు. వాని సృష్టిని లోకుల బాటలుగాని, సామాజిక నీతి నియమములుగాని బంధింపజాలవు. అతడు సర్వ స్వతంత్రుడు. వాని సత్యాత్మిక భావనలో అతడు తిలకించెడి రస స్వరూపమును కవన ముఖమున అభివ్యక్తపరచి మానవ హృదయమున ఆనందరసము ప్రవహింపజేయును. అతని భావనలో శిల్పికి దొరకని వస్తువు, చిత్రలేఖకునకు దొరకని చిత్రవిచిత్రములైన రంగులు, సంగీతమునందు లేని భావములు నిళితములైయున్నవి. అతడు స్వర్గమును సృష్టించ గలడు. భగవంతుని స్వరూపమును మనకండ్లయెదుట చిత్రించ గలడు. వ్యాసుడు మర్త్యలోకమునందలి ధర్మ సంగ్రామ రహస్యము నుద్ఘాటించి మహాభారతమునకు పంచమవేదమను ప్రసిద్ధిని కలిగించెను. వాల్మీకి మానవ చరిత్రయందలి భావ శబలతను కావ్యాదర్శమున ప్రతిఫలింపజేసి శ్రీరామచంద్రుని భారతీయుల కుపాస్య దేవతగా ప్రసాదింప జేసెను. కాళిదాసు ప్రణయకీర్తనముచే పృథివిని స్వర్గమునజేర్చెను. ప్రపంచమున కాలమును ధిక్కరించి శాశ్వతముగ నిలచునవి ఉత్తమ కావ్యములే. భారతీయుల కావ్యజగత్తు పారములేని ఆనంద సింధువు.



## సమస్య

శ్రీ వసంతరావు రామకృష్ణరావుగారు

మీర లందరు బుధజనులార! వినుడు.
అబ్ధి నామంబు దెలుపు నష్టాక్షరములు
గల్గినట్టి పదం బొండు గలదు. దాని
మూడు, యే, డెన్మి దక్షరములను కలుప
'అవలితీరము' అనియెడు నర్థమిచ్చు
ఒకటి, రెం, డెన్మి దక్షరా లొకట కలుపు
పదములో 'మనోహర' మను భావముండు
ఐదు, షే డెన్మి, దక్షరా లవియు కలుపు
పదములో 'చేవ' యనియెడు భావముండు
ఒకటి, ఆ, రెన్మి దక్షరా లొకట కలుప
గానమునకుండు ముఖ్య లక్షణము తెల్పు
దాని యాధారమున చెప్పవలదె పేరు?



అఖిలభారత మహిళా మహాసభ మద్రాసు శాఖవారు తమ కార్యకలాపాలకు ధనము చాలకున్నదని దాతలు విరివిగా విరాళాలివ్వమని కోరుతూ ఈ క్రింది విధంగా విజ్ఞప్తి చేశారు:—

ఈ సంఘం భారతదేశంలో కెల్లా పెట్టమొదటిది. 32 సం॥లనుంచీ, స్త్రీల అభ్యుదయ కార్యంలోనేమి, ప్రబోధించడంలోనేమి, సంఘంలో వారు తమ అర్హస్థానం ఆక్రమించేటట్లు తోడ్పడడంలోనేమి వెలలేని సేవచేసి యున్నది. యునైటెడ్ నేషన్స్ వారెన్నుకొన్న సాంఘిక సేవాసంస్థలలో నిది యొకటైయున్నది. ఉచిత గ్రంథాలయాలు, పఠనాలయాలు ఏర్పరచి నడుపుతున్నాము. నూలువడకడం, మిషన్‌కుట్టు, లేసు అల్లడం, సంగీతం నేర్పిస్తున్నాము. హిందీ క్లాసులు నడిపిస్తున్నాము. ఆ విద్యార్థినులు పరీక్షలలో ఉత్తీర్ణులవుతున్నారు. ఇవన్నీ ఈ సంఘపు 5 శాఖలలోను సాగుతున్నవి. ఇవిగాక కేంద్రం కార్యాలయంలో - శిశువులకు పాఠశాల, ఉద్యోగాల విచారణాలయం, సమర్థతతో నడుస్తున్నాయి. వయోజన విద్యాతరగతులు, పరిశ్రమలనేర్పే తరగతులు నడుపుతున్నాము. 'కాన్సర్' అనే క్రూరవ్యాధి నిర్మూలనార్థమై తీవ్రప్రయత్నాలు చేస్తున్నాము. అవి చాలావరకు ఫలిస్తున్నాయికూడ. ఇంతవరకు ఉదారస్వభావులైన స్త్రీ, పురుషులిస్తువచ్చిన విరాళాలతో ఈ పనిఅంతా సాగుతూవచ్చింది. ఇప్పుడు పనులు విస్తరించగా - వ్యయము ఆదాయాన్ని మించినది. మా కార్య కౌశలమందు గర్వంతోను, మా కార్యకలాపములందలి విశ్వాసముతోను - మేము - దాతలను - ధనరూపకంగా, వస్తురూపకంగా విరివిగా విరాళాలివ్వమని కోరుతున్నాము.

ఇటీవల - జపాను ప్రభుత్వమున్నూ, స్టర్లింగు ఏరియా ప్రభుత్వాలున్నూ వర్తకపు ఒడంబడికలు చేసుకున్నాయి. జపాను, అమెరికా పలుకుబడిలో ఉన్నది. స్టర్లింగు ఏరియాదేశాలు బ్రిటిష్ పలుకుబడిలోనివి. అయితే - న్యూసౌత్ వేల్స్ గృహలక్ష్ముల సమితి - ఆస్ట్రేలియాలో దిగుమతిఅయ్యే జపాను సరుకులన్నీ బహిష్కరించడానికి తీర్మానించింది. ఆ సమితి అధ్యక్షురాలు - శ్రీమతి గ్లేక్రాస్‌సతి ఇట్లని చెప్పినది:—

"మా సమితి సభ్యులం - జపాను వస్తువులు కొనవద్దని - నోటిప్రచారం చేయుటకు తీర్మానించుకున్నాము. యుద్ధకాలంలో మా ఆస్ట్రేలియా అష్టమదశాన్ని ఈ జపాను సైనికులుపెట్టిన అమానుష హింసలు - మా స్త్రీలలో పలువురి ఆత్మలనంటి ఇంకా గీరుతున్నాయి."

డాం కాథరైన్ వాట్స్ అనే ఆమె బ్రిటిష్ గవర్నమెంటులో ఆరోగ్యశాఖ వారికి రోగుల కుపచారం చేసే విషయాలలో ముఖ్యమైన సలహాదారు. ఈమె గతరెండు ప్రపంచ యుద్ధాలలో ఈశాఖలో పనిచేశి అనుభవం సంపాదించి ఉన్నది. బ్రిటన్‌లోను ఇతర దేశములలోను ఆసుపత్రుల నేర్పరచడంలో చాలా అనుభవం సంపాదించినది. 1939 లో బ్రిటిష్ ప్రభుత్వపు వైద్యశాఖవారు ఈమెను యమర్జన్సీ మెడికల్ సర్వీస్‌లో ప్రధానమైన దాదిగా నియమించారు. 1948లో రోగుల కుపచారము నడిపించే పనిలో

ప్రభుత్వానికి ముఖ్యసలహాదారుగా నియమించారు. బ్రిటిష్ రెడ్‌క్రాస్‌వారి నర్సింగ్ అడ్వైజరీ బోర్డులో సభ్యురాలు. ఇంటర్నేషనల్ రెడ్‌క్రాస్‌వారు ఈమెకు ఈ సంవత్సరం 'ఫ్లారెన్సు నైటింగేల్ మెడల్' ఇచ్చినారు. ఈమె ఇప్పుడు మనదేశానికి వచ్చి భారత్ యూనియన్, పాకిస్థాన్, సింహళములను దర్శిస్తుయున్నది. ఆమె మద్రాసులో ఆసుపత్రులను చూచినమీదట పత్రికా విలేఖరులతో ఇట్లని చెప్పినది:-

"ఆరోగ్యమైన జాతినిర్మాణం కావాలంటే, మంచివసతి, మంచి ఆహారం- అవసరం. గర్భిణీస్త్రీల ఆరోగ్యం జాగ్రత్తగా కాపాడాలి. నేనీ పట్నంలో చూచిన ఆస్పత్రిలో రోగులు క్రిక్కిరిసి ఉన్నారు. వారికి, ఉపచారం చేసేవారు క్లుప్తంగా ఉన్నారు. అశోకవిహార్ నాకునచ్చింది. రాష్ట్రమంతటా అలాంటి సంస్థలేర్పడాలి."

ఇంగ్లాండులో నర్సుల స్థితిగతులను గూర్చి అధికంగా ఆమె ఇట్లా అని చెప్పింది :-

"అక్కడ 'నర్స్' అనే ఆమెకు కొంత సంరక్షణ ఉన్నది. ఆపేరు పెట్టుకొని ఎవరైనా కృత్రిమం చేస్తే శిక్షిస్తారు. అక్కడ 'శిక్షణ పొందని దాదులు' అనికొందరు లేరు. ఇంగ్లాండులో నర్సులు పెండ్లి చేసుకొని ఇంకా ఆవృత్తి సాగించడానికి అభ్యంతరము లేదు. ఇంగ్లాండులో నర్సుకు గౌరవము హెచ్చు. ఇక్కడనుంచీ ఉత్తమ శిక్షణకొరకు స్త్రీలు ఇంగ్లాండువస్తే అక్కడ ఆసుపత్రులలో అందులకేర్పాట్లు చేస్తారు."

నర్సులసంఘం వారు ఆమెకు స్వాగతమివ్వగా వారితో నిట్లుముచ్చటించినది.

"బ్రిటన్‌లో నర్సులు వారానికి 48 గంటలు పనిచేస్తారు. అక్కడ నర్సుల అసోసియేషన్‌లో 46,000 మంది సభ్యులున్నారు. చాల నిష్కర్షగా వైద్యపరీక్ష చేసినమీదట 18 సం॥ల బాలికలను దాది శిక్షణ ఇవ్వబడుటకు అంగీకరించి గైకొందురు. 10, 12 వారాలు ప్రాథమిక శిక్షణనిస్తారు; ఆపైన అసలు శిక్షణ ఇస్తారు. ఇంగ్లాండులో చాలామంది 'పురుషులుకూడా దాదులు' గా ఉన్నారు. వారు ముఖ్యంగా పిచ్చి ఆసుపత్రులలో మగవారికి ఉపచారం చేస్తారు. దాది వృత్తియే ప్రప్రథమమున అంతర్జాతీయముగా సన్నాహ పరుపబడినది."

సర్. మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారు హైదరాబాదులో ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు విద్యార్థుల కుపన్యసించుచు ఇట్లునుడివిరి:-

"స్వతంత్రభారత దేశంలో నిర్బంధంగా జనమందరికీ విద్యచెప్పాలి. 100 కి 70 మంది అయినా భారతదేశంలో ప్రజలు విద్యావంతులు కానిచో ప్రపంచంలో భారతదేశం ప్రథమశ్రేణికి చెందినది కాజాలదు."

అంతర్జాతీయ ప్రవీణుల సహాయసంపత్తికి గల "స్టడీగ్రూప్" వారు యునెస్కో వారికి (శ్రీ రాధాకృష్ణన్‌గారు దీనికధ్యక్షులు) "ఆరోగ్యము-గృహజీవనము" అనేవిషయమై విచారించి తయారుచేసిన తమరిపోర్టు సమర్పించారు. దానిలో ఇట్లున్నది:-

ఆరోగ్యభాగ్యమును ప్రజలకు చేకూర్చవలెనంటే కనీసము ఈమాత్రమైనా అవసరం: ప్రతి 5,000 మంది జనానికి ఒకమంత్రసాని; ప్రతి 10,000 మంది జనానికి ఒక ఆరోగ్యకేంద్రం ఆకేంద్రంలో ఒకదాది (Nurse) ఇద్దరు మంత్రసానులు, ఒకశానిటరీ ఇన్‌స్పెక్టర్, ఒకసాంఘిక సేవకుడు; ప్రతి 30,000 మంది జనానికి వివిధ ఆరోగ్య కేంద్రములతో కూడిన ఆరోగ్యసంస్థ, దానిక్రింద ఒక ఆసుపత్రి, డాక్టరు."

—***—

# లోకవార్తలు



ఇన్నాళ్లు - బ్రిటిష్ సింహాసనానికి ఇప్పటి వరకు వారసురాలు ఎలిజబెత్ రాకుమారి అని అనుకుంటూ వచ్చింది లోకం. కుల్లూకభట్టులాంటి న్యాయశాస్త్రవేత్త యొకడు ఈ విషయం న్యాయశాస్త్రరీత్యాగలికి వారి లా జర్నల్‌లో ఒక వ్యాసం వ్రాశాడు. దాని ప్రకారం మార్గరెట్ రాకుమారి (చెల్లెలు) కూడా వారసురాలే అవుతుందట. అందుచేత ఈ సంగతి త్వరగా తెలిస్తే మంచిది అంటు న్నాడీ విలేఖరి.

♦ ♦ ♦

ఢిల్లీనగరంలో పడుపు వృత్తిలో ఉన్న స్త్రీలను ఆ వృత్తినుండి తప్పించి సన్మార్గంలో ఉంచను ఒక సంఘం ఏర్పడ్డది. దానికి శ్రీమతి రామేశ్వరీ నెహ్రూ అధ్యక్షురాలు.

♦ ♦ ♦

కాశీ హిందూ విశ్వవిద్యాలయం ఇంజనీరింగు విద్యార్థులు ఒక క్రొత్త టీ మిషన్ కనిపెట్టారు. అందమర్చబడిన రంధ్రంలో రెండణాలబిళ్ల విడువగానే అప్పటి కప్పుడు నీళ్లను కాచి, టీ తయారుచేసి దానియందే అమర్చబడిన కొళాయిక్రింద ఉంచిన కప్పునిండా టీ నింపుతుంది. ఇదంతా విద్యుచ్ఛక్తి సాహాయ్యాన జరిగిపోతుందట.

♦ ♦ ♦

డెన్మార్క్ పాఠశాలల్లో పాఠ్యగ్రంధాలలో గాంధీ బొమ్మలు అచ్చువేశారు; గాంధీ చరిత్ర పాఠాలుగా చేర్చారు.

♦ ♦ ♦

1906 లో శాన్‌ఫ్రాన్సిస్కోలో ఒక భాగ్యశాలి తన భర్త తన్ను వదిలేశాడని - తన వివాహాన్ని రద్దుపరచమని దావా చేసింది. అప్పటికి తాత్కాలికంగా రద్దు అనుమతించారు. ఇన్నాళ్లకు - (43 సం॥లు) ఆ రద్దును ఖాయపరిచారు. ఇంత ఆలస్యానికి ఏమి తిరుగుడు వచ్చిందో తెలియదు.

♦ ♦ ♦

'Gone with the wind' అనే అద్భుతమైన రంగుల చిత్రాన్ని చాలామంది వెండితెరపైచూచి ఆనందించియుంటారు. ఆ కథను రచించిన ఆమె శ్రీమతి మార్గరెట్ మిచ్చెల్ సతి. ఆమె కొంతకాలం క్రిందట ప్రమాదవశాన కారుక్రిందపడి చనిపోయింది. ఆ కారు డ్రైవరుకు 18 మాసాల ఖైదుశిక్ష విధించారు.

♦ ♦ ♦

'మొనకో' అనేది యూరప్‌లోగల చిన్న స్వతంత్ర రాజ్యాలలో రెండవది. దాని రాజు, 26 సం॥ ల మూడవ రెయినర్ రాకుమారుడు గత మాసమందు సింహాసన మధిష్ఠించాడు. ఇంతకు పూర్వం రాజ్యంచేస్తున్న అతని తాత గత మే నెలలో చనిపోయినాడు. ఆ రాజ్యానికి 80 మంది తుపాకి దళం, 500 మంది సివిల్ ఉద్యోగులు, జనాభా 20,000. అయితే అసలు దేశీయులు 2000 మందే. మిగతవారు ధనాఢ్యులైన విదేశీయులు. ఆ దేశీయులలో సగంమంది - అంటే 1000 మంది - వర్షంలో తడుస్తూ రాజుగారు నగరం తాళంచెవులు పుచ్చుకోడం తిలకించారు.

♦ ♦ ♦

అమెరికాలో 26-10-49 నాటికి ఆ పదినెలల్లో తయారైన కార్లసంఖ్య 53,59,000. 1929 లో

మొత్తంమీద తయారైనవి 53,58,420. అమెరికాలో ఆ సం॥మే హెచ్చు ఉత్పత్తి ఇప్పటికి.

◆ ◆ ◆

దూరశ్రవణం, దూరదర్శనం అనేవి పూర్వం సిద్ధులు సాధించిన మహిమలు. ఇప్పుడవి శాస్త్రజ్ఞులు సామాన్య మానవుని అందుబాటులో ఉంచినారు. రేడియో ద్వారా దూరశ్రవణం మనదేశంలోను చేయగల్గుతున్నాము, 'టెలివిజన్' అనే సాధనం ద్వారా 'దూరదర్శనం' కూడా సాధ్యం. అంటే ఏ అమెరికాలోనో జరుగుతున్నది ఇక్కడ మనకు టాకీలోవలె బొమ్మలతోసహా కనబడి వినబడుతుంది. 1956 నాటికి అమెరికాలో ఈ టెలివిజన్ పెట్టెలు 2,40,00,000 అమలులోకి వస్తాయని అంచనా.

◆ ◆ ◆

పార్శ్వపు తల నొప్పులను ఆడగుర్రములవల్ల లభ్యమయ్యే ద్రవపదార్థ మొకటి ఇంజక్షన్ ఇచ్చి, కుదర్చడమును లండన్‌లో ఒక డాక్టరు కనిపెట్టినాడు. చికిత్సపొందినవారిలో సగంమందికి నెలరోజులలో నయమైనదట. ఈ చికిత్సకు 5-10 పౌ॥ల మధ్య ఖర్చు.

ఢిల్లీలో ఇటీవల వృద్ధిచేసిన స్కూలు జీతాలను తగ్గించమని ఆందోళనచేసే విద్యార్థులు 40 మంది ఊరేగింపుగవచ్చి శాసనసభ వెలుపల అల్లరి ప్రదర్శనము చేయుచుండగా - పోలీసులు వారి నరెస్టు చేశారు; వారిలో 20 మంది విద్యార్థినులట!

◆ ◆ ◆

ఢిల్లీచీఫ్ కమీషనర్ సెక్రెటరేట్ ఆఫీసుకు తూర్పు పంజాబు హైకోర్టు రిజిస్ట్రారువద్దనుంచి "క్రిందిగుమాస్తాలను" తగ్గించివేయమని ఉత్తరము వచ్చినది. వెంటనే ఆ పని జరిగిపోయింది. తీరా ఆరాదిస్తే ఆ ఉత్తరం దొంగ ఉత్తరం!

◆ ◆ ◆

ఓఢ్రరాష్ట్రానికి గవర్నర్ జనరల్ శ్రీ రాజాజీ వచ్చినప్పుడు గవర్నర్ అసఫ్అలీ తోట విందు చేశాడు. అందు అతిథులకు టీ, షర్బత్, తాంబూలం తప్ప మరేమి ఇవ్వలేదు.

◆ ◆ ◆

'జెమిని' వారు తయారు చేసిన హిందీఫిల్ము చిత్రం. "నిశాన్" ఢిల్లీలో ప్రదర్శింప బడింది. సైనిక శాఖ మంత్రి సర్దార్ బలదేవ్ సింగుగారు తిలకించి చాలా మెచ్చుకున్నారు.

# సంపాదకీయములు

## సర్వీస్ కమిషన్ పరీక్షలు - స్త్రీలు.

సర్వీసుకమిషన్ వారి 1948 - 49 సం॥ము పరీక్షల ఫలితాలనుగూర్చి కమిటీవారు ప్రకటించారు. పూర్తిగా ఆడవాళ్లచే నిర్వహింపబడే ఆఫీసులలోనివీ, ఆడవాళ్లకే ఉద్దేశింపబడినవీ - అయిన గుమాస్తాగిరీ మున్నగు ఉద్యోగాలకని - 26 గురు స్త్రీలు ధరఖాస్తు చేశారు. వారిలో 23 గురు పరీక్షలిచ్చారు. అందు 19 మందికే అవసరమైన మార్కులు వచ్చాయి. అసలు కావలసినవారు 11 మంది, అయితే 7 గురిని మాత్రమే ఎన్నుకొని ఏర్పరచడమైనది. మిగత నలుగురు తెలుగువచ్చినవారైయుండాలి. వారు లేనందున - ఖాళీగా ఉంచవలసివచ్చినది - అని ఆ వివరాలు తెలుపుతున్నాయి. ఇదియెంతైనా జుగుప్సాకరమైన విషయము. నిర్ణయింపబడ్డ ఉద్యోగాలు స్వీకరించడానికి తగినంతమందిఅయినా తెలుగుస్త్రీలులేరా? ఈ విషయాల్నిగూర్చి - అఖిలభారత మహిళామహాసభా ఆంధ్రశాఖ శ్రద్ధవహించాలి. వారొకఉద్యోగాలకమిటీ నేర్పరచి ఈ పనివారి కప్పచెప్పాలి.

## విశ్వనాధంగారి వరకట్నాల నిషేధపుబిల్లు.

శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు వరకట్నాల నిషేధపుబిల్లును మద్రాసు అస్సెంబ్లీలో ప్రవేశపెట్టనున్నారని తెలియగనే మేము దానిని బలపరచుచు వ్రాసియుంటిమి. ఇది చిరకాలముగా అవసరమైయున్న చట్టము. కాంగ్రెసువారు సాంఘికవిషయములలో ముందంజవేయువారని ప్రతీతి. అయినను ఈ బిల్లును మద్రాసు కాంగ్రెసుపార్టీవారు చర్చించి నిరాకరించినవిధము హర్షింపదగినది కాదు. దాదాపు 200 మంది సభ్యులుగల ఆపార్టీలో ఈ బిల్లుచర్చ సమయమున 75 మంది సభ్యులే హాజరైరి. వారిలో 47 మందే ఓటు చేసిరి. మిగత 28 మందికి ఈ బిల్లువిషయమై ఏ అభిప్రాయమును లేదా! వారిల్లో 19 మంది మాత్రమే అనుకూలురు. ఈ వరకట్నములు సంఘమును మొత్తముమీద, వ్యక్తిగతముగా మధ్యతరగతి కుటుంబీకులను ఏవిధముగా నమలివేయుచున్నది అందరికిని అనుభవములోనున్నదే - న్యాయశాఖామంత్రి శ్రీ మాధవమీనన్ గారు ఈ బిల్లువల్ల ఏమియులాభముండదను - అనుట మాకేమాత్రమున్నూ గ్రాహ్యము కాలేదు. స్త్రీలకు ఆర్థిక స్వాతంత్ర్యముకల మలబారున వరకట్నముల బాధలేకపోవుటచే వారికి దీని ప్రాముఖ్యత తోచకపోవచ్చును. అన్నిప్రాంతములవారితో కూడిన వారికార్యనిర్వాహకవర్గమున్ను - దీనిని త్రోసిపుచ్చినదట. ఈవరకట్నపిశాచము ఆవరించినది కేవలము ధనాఢ్యులననియు, "కేవలము" చట్టము దీనిని నిర్మూలనం చేయజాలదనియు - వారభిప్రాయపడిరట. "కేవలము" చట్టమున కట్టి శక్తిచాలకపోవచ్చును. కాని చట్టము దానిని నాపు చేయుట కెంతో యుపకరించునుగదా. చట్టమునకు వెలిగా జరుగు ప్రయత్నముల కది మిక్కిలిగా యూతమిచ్చునుగదా. ఆవాదము అన్ని సాంఘికచట్టములకు చెప్పవచ్చునుగాని ఒక్క వరకట్నముల నిషేధమునకే గాదు. ఈబిల్లును త్రోసివేసి మద్రాసు కాంగ్రెసుపార్టీవారు తమ విధ్యుక్తధర్మమును నెరవేర్చనివారైనారు. ఈ సందర్భమున బిల్లున కనుకూలముగా పోరాడిన శ్రీమతి అమ్మన్నరాజాగారిని మేమెంతయు అభినందించుచున్నాను. త్వరలో ఆమెయే ఇట్టిబిల్లును మరొక్కసారి తెచ్చి కాంగ్రెసుపార్టీచే ఆమోదింప చేయుగల్గునని ఆశించుచున్నాము.

## మద్రాసు కార్పొరేషన్ క్రొత్తమేయర్

డా. పి. వి. చెరియన్ గారిని మద్రాసు కార్పొరేషన్ వారు ఈ సంవత్సరమునకు మేయర్‌గా ఎన్నుకొన్నందులకు వారి నభినందింతుము. పురపాలక సంఘముయొక్క ముఖ్యకార్యక్రమము - పురపారి

శుధ్యము. "నేను వైద్యుడను గావున నగరమందలి ఆరోగ్య సంరక్షణమే నా ప్రథమ కర్తవ్యము" అని మేయరు గారానే డాక్టరుగారన్నారు. నగరమందలి అనారోగ్యము పలుముఖములు. ముఖ్యముగా - పేద వారి నివాసములు (Slums) అనారోగ్యతకు జన్మస్థానములు. ఆ అనారోగ్యతకు తోడువారికి వైద్య సహాయమును స్వల్పము. శ్రీ డాక్టరుగారు ఆ పేదల నివాసములకు సౌకర్యములొనర్చు పనిబూనుదురనుట ప్రశంసార్హము. ఇటీవల మద్రాసు మహిళా సంఘమువారు స్త్రీలకు హెచ్చుగా వచ్చే కాన్సర్ వ్యాధి నిర్మూలనానికి ప్రత్యేకమగు చికిత్సకు ఏర్పాట్లు చేయవలెనని ప్రభుత్వమును వత్తిడిచేస్తున్నారు. డాక్టరు గారున్నూ మేయరుగా తాము శాయశక్తులా అందుకై కృషిచేస్తామంటున్నారు. ఇందుకు నగరవాసులేగాక రాష్ట్రవాసులంతా వారిని అభినందించగలరు. డాక్టరుగారి హయాములో నగరమందలి శిశు మరణములు తగ్గుటకును నిరుపేదరాలైన గర్భిణిస్త్రీలకు సుఖప్రసూతి వసతి ఏర్పడుటకును గట్టిపునాదులు వేయబడునని ఆశింపగలము. శ్రీ డాక్టరుగారి ఆశయములు నెరవేరునని ఆశించెదము.

## రేయన్ పట్టుఫ్యాక్టరీ

కేరళరాష్ట్రంలో రేయన్ పట్టుఫ్యాక్టరీ పెట్టుచున్నారనుట స్త్రీలకు సంతోషదాయకమైన విషయం. దీనికే "రేషన్ పట్టు" అని మనవాళ్లు నోరుతిరగక అంటూ ఉంటారు. స్త్రీలకు పట్టుచీరల మీద ఉన్న మక్కువ చెప్పనక్కరలేదు. అయితే ఇదివరలో ఈ మాయపట్టు విదేశాలనుండి దిగుమతి అయ్యేది. కాస్త, కూస్తకాదు. యుద్ధానికి ముందు 75 టన్నుల పట్టుదిగుమతి అయ్యేదట; అయితే ప్రస్తుతం దిగుమతి నియమాలవల్ల ఆ ఉరువు తగినది. మాయపట్టు గిరాకీ అయింది కాబట్టే ఆనార చీరలు ధర పెరిగింది. ఇకపై మనదేశంలోనే మాయపట్టు ఉత్పత్తి అయితే ఆడువారికి నాజూకైన చీర రవిక దొరకడమే గాక నూలుచీరల ధరలు తగ్గుతాయి. ఈ రేషన్ పట్టునేశేవారి కుటుంబాలలో ఆడువాళ్ళు చేతినిండపని లేక కూలికి నాలికి వెళ్లవలసిన బాధతప్పుతుంది. ఈమిల్లు మనదక్షిణ దేశంలో ఏర్పడడంకూడా హర్షింపదగినది. ఔత్తరాహులను కనిపెట్టుకొని ఉండనక్కరలేదు. తిరువాంకూరులో ఉత్పత్తి అయినది. నేలమీదగాని సముద్రం మీదగాని తెలుగు దేశం దాటే ఉత్తరానికి పోవాలి. ఇప్పుడీ మిల్లులో 5 టన్నులు మాత్రమే సరకు తయారగునట. క్రమంగావృద్ధి పొందవచ్చు. గృహపరిశ్రమలు వృద్ధిపొందే కొద్ది స్త్రీలు, తమ ఇండ్లలోనే ఈపట్టుతో సంచులు వగైరాలు అల్లడం, నూలు గుడ్డలకు అంచులు కుట్టడం రిబ్బనులు వగైరా నేయడం కూడా నేర్చి బ్రతుకుతెరువు చూచుకోవచ్చు.








**ఆంధ్రనారి రచయిత్రి: శ్రీమతి లక్ష్మీరఘురామ్‌గారు బి. ఏ. దొరకుచోటు: నవజీవన్ బుక్ డిపో. 13 వాల్‌టాక్సురోడ్ మద్రాసు. 3. వెల రు 1-0-0.**

శ్రీమతి కొత్తలక్ష్మి (నారాయణమ్మ) రఘురామ్ బి.ఏ.గారు తామప్పుడప్పుడు మహిళా ప్రబోధకరముగా ఇచ్చిన ఉపన్యాసములు, రేడియో ప్రసంగములు గుదిగుచ్చి ఇంకను దానికి కొంత చేర్చి ఈగ్రంధరూపమున ప్రచురించి 'ఆంధ్రనారీ'లోకమునకు వెలలేని సేవచేసినారు. ఆంధ్రనారీమణులు, గృహకృత్యములను ఉత్తమ రీతిని నిర్వహించి ఆదర్శప్రాయలగు గృహలక్ష్ములగుట కుపకరించే అనేకవుత్తమవిషయములనామె ఇందు చేర్చినది.

ఆయావిషయములను వివరించుపట్ల ఆమె కేవలమాదర్శప్రపంచమున విహరించలేదు; ఛాందసముగను ప్రవర్తింపలేదు. వాస్తవికజ్ఞానముతో సులభగ్రాహ్యములు, సులభసాధ్యములునైన వానినే ఇందుపొందుపరిచినది. తనబిడ్డలకు దేశభక్తి బోధించవలసిన తల్లి కీమెయుందుగా దేశభక్తి బోధించినది. అయితే భారతదేశమునందు మరియున్నట్లు ఆంధ్రరాష్ట్రమును చిత్రించిన బాగుండేది. సంఘసమస్యలు, గృహనిర్వహణ, శిశుపోషణ, విద్యావినయములు, మతములు, సౌందర్యపోషణ, పాకకళ. తీరికసమయములు, వైద్యవిధులు, హితవులు, సంఘసేవ చేయదలుచుకొన్న స్త్రీలకు కొన్ని సలహాలు, రాజకీయములు, సందేశములు-అను 14 శీర్షికలక్రింద ఈ 73 పుటలగ్రంధము చక్కగా విభజించి వ్రాయబడినది. విద్యావతులకు ఉద్యోగాది లౌకికవ్యాపారములకన్నా గృహనిర్వహణము, మాతృత్వము శిశుపోషణము పైచేయియని ఈమె అభిప్రాయము ఊరిలో మగవాని ఇష్టం; ఇంటిలో ఇల్లాలి ఇష్టం - ఒకరికొకరు సలహాలిచ్చుకోవచ్చు. ఇది ఈమె కోరే స్త్రీ స్వాతంత్ర్య స్వరూపము.

"నేటివిద్యావతులగు స్త్రీలలో ఒకబ్రిడ్జి (Bridge) రబ్బరు ఆడకపోయిన నిద్రపోలేనివారు, ఒకసెట్టు టెన్నిస్ ఆడకపోయిన భోజనము జీర్ణించుకొనలేనివారు, రోజుకొక్కసారైయైన ఇంట బైట పెత్తనమునకు పోకపోయిన "Fed up" కాగుల సుకుమారలతాంగులు ఆరోజుకారోజు పుట్టగొడుగులవలె బయలుదేరుచున్నారు." (25, 26, పు)

అని ఆధునికస్త్రీల వెర్రిపోకడలనీ పట్టభద్రురాలభివర్ణించినది. ఆయాయవి వాటంతటఅవి దూష్యములని మేమనము గాని – అవి ఆధునిక స్త్రీలలో కొందరికి నూత్న వ్యసనములైన వీనిమాత్రము అంగీకరింతుము. ఆమెసాటి సోదరీమణులకిచ్చిన మూడుసలహాలను "ఇంటి పనులలో మెళుకువ" లందు అచ్చువేసితిమి. దానినిబట్టి ఆమెరచనావిధానమేగాక యోచనలవైఖరియు బోధపడగలదు. ఈమె విగ్రహారాధనను ఏకాగ్రతకు సాధనభూతముగా అంగీకరించును గాని మోక్షదాయకముగా సమ్మతింపదు. రామకృష్ణులు పూజనీయులనును గాని దేవతలనదు. ఈమెకు ఆభరణములు అందానికి గాని ఆధిక్యత వెల్లడించుటకు కాదు. ఈమెగ్రంధమున పాకకళ యొక భాగమైనందుకు సంతసింతుము. నవవధూవరులు-హోటలునుంచి అన్నము తెప్పించుకొని తినుట నీమెగర్హించును. తీరికసమయముల ననేక కార్యకలాపములతో గడిపి సద్వినియోగము చేయుటకు మార్గములచూపినది. (51/53 పు) ఆయాపనులు పేదలకు జీవనోపాధి కల్పించుననియు ఆవిడతలంచుచున్నది. వైద్యవిధులు చక్కగా వివరింపబడినవి. ప్రతిగృహలక్ష్మియు నిరంతర ఇంటసిద్ధముగానుంచుకోవలసిన అత్యవసరమగు మందుల జాబితాలను ఎంతో జాగ్రత్తగతయారుచేసి ఇందుపొందుపరచియున్నది. ఈమె ఆయావిషయములలో చక్కగావిభాగించి వ్రాసినపద్ధతిమూడగా - నిదిపాఠశాలలందు బాలికలకు పఠనీయ గ్రంధముగా నిర్ణయింపదగినదని మాఅభిప్రాయం.

1507

# శ్రీ విరోధినామ సంII మార్గశిర, పుష్య మాసములు.

| | తేది | వారం | |
|---|---|---|---|
| డిసెంబరు నెల | 16 | శు | ఏ 4-26 ద్వా 54-15 స్వా 35.47 రావి 21-21 మధ్వవైష్ణవ ఏకాదశి దినత్రయం. |
| | 17 | శ | త్ర 53-17 విశా 31-56 రావి 13-51 శనిత్రయోదశి. |
| | 18 | ఆ | చ 48-25 అనూ 28-39 రావి 14-29 మాసశివరాత్రి. |
| | 19 | సో | ● 44 17 జ్యే 25-48 అమ సోమవారవ్రతం. |
| | | | పుష్య మాసము |
| | 20 | మం | శుద్ధపాడ్యమి. 4-14 మూ 23.56. రావి 20-44. |
| | 21 | బు | ద్వి. 38-53 పూషా. 22-56. రావి 15.32 చంద్రోదయం. |
| | 22 | గు | త 37-54 ఉషా. 23 8. రావి 5 54. |
| | 23 | శు | చ 38-9 శ్ర 24-33 రావి 7-33 మకరాయనం. |
| | 24 | శ | పం. 39-45 రావి 18.55 యమకంటకయోగః. |
| | 25 | ఆ | ష 42-32 శత 31-3. రావి 20-54. |
| | 26 | సో | స 46.27 పూభా 36-1 మకరే బుధః. |
| | 27 | మం | అ 51-14 ఉభా 41.49 దివి 2-20 మహారుద్రాష్టమి. |
| 1949-50 సంII | 28 | బు | న 56-35 రే 48-12 దివి 15.0 ఉత్పాతయోగః. |
| | 29 | గు | ద 60-0. అశ్వ 54-45 రావి 16-9 |
| | 30 | శు | ద 2-1. 60-0. దివి 21-15 శ్రీమంగళాద్రి లక్ష్మీనృసింహస్వామివారి జగన్మోహిని అలంకారోత్సవం. |
| | 31 | శ | ఏ. 7-7. భ 1-1. దివి 6-13 శనివక్రతారంభం. |
| | 1 | ఆ | ద్వా. 11-31 కృ 6-39. రావి 22-12 కూర్మద్వాదశి దగ్ధయోగః. |
| | 2 | సో | త్ర 14-53 రో 11-20 దివి 26-10 చతుర్దశీతిథిః. |
| | 3 | మం | చ 17-3 మృ 14-53 రావి 9-7. పూర్ణిమాతిథిః. |
| | 4 | బు | ○ 17-59 ఆర్ద్ర 17-10. రావి 19-36. ప్రతిపత్తిథిః. |
| జనవరి నెల | 5 | గు | బ. పాడ్యమి. 17-36 పు. 18-15 ద్వితీయాతిథిః. |
| | 6 | శు | ద్వి. 16-0. పుష్య 18 8. రావి 21-52 తృతీయాతిథిః. |
| | 7 | శ | త 13-17 ఆశ్రే 16-56. రావి 18.3. శుక్రవక్రతారంభః. |
| | 8 | ఆ | చ 9-35 మ 14-47 రావి 6-10. యమకంటకయోగః. |
| | 9 | సో | పం. 5-5 షష్ఠి 54-51 పూ.ఫ 11-50. రావి 1-7. దినత్రయం. |
| | 10 | మం | స 54 21 ఉఫ. 19. రావి 0 16. పశ్చాదస్తమితో బుధః. |
| | 11 | బు | అ 43-32 హ 4-23 దివి 23-0. అనధ్యాయం. |
| | 12 | గు | న 42 39 చి 0-13. స్వా 55-50 దివి 13-15. |
| | 13 | శు | ద. 36-47 విశా 52 9 దివి 9-8. మకరేఅర్కః. |
| | 14 | శ | ఏ 31 36 అనూ 48.38. ది 1-4 ఉత్తరాయణపుణ్యకాలం. సర్వేషామేకాదశి. |
| | 15 | ఆ | ద్వా 26.50 జ్యే 45-46 వృ 24-53 దివి 1-6. దగ్ధయోగః. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.

# కుప్పమ్మ—కమలమ్మ కథ

''' తందనానా తాన తానందనానా, తందనానానాన తందానతాన '''

కొండలాలా వారి కుప్పమ్మ ఒకనాడు, పనిబడీవచ్చింది పక్కింటి వేపు
కడుపునొప్పితోటి కమలమ్మ పక్కపై, కళ్లనీళ్లేకంగ కారుస్తవుంటే
ఎందుకే ఓకమల ఎందుకే ఏడుస్త, ఏమి బాధో చెప్పి ఏడ్వమన్నాది.

కడుపునొప్పితోటి కడగండ్లు బడుతూంటె, ఎగతాళి గిగతాళి ఇప్పుడా నీకు
అబ్బ యీ బాధ నీకబ్బినట్లైతే, యీ మాయలన్నీని ఎగిరిపొయ్యేవి

చూసియెళ్లేవారు చెబుతారుగాని, బాధసంగతివారి బాబుయిన్నాడా
కమలమ్మయీలాగు కళ్లెఱ్ఱజేసి, దడదడాతిట్టంగ తడబాటులేక

కుప్పమ్మ అన్నాది కొంపేమిమునిగింది, లోధ్రబుడ్డీ తాగలేకపొయ్యావా
మందులన్నీ తాగి మతిచెదరిపోయింది, లోధ్ర గీధ్ర వద్దు లోకమే వద్దు

అని లోధ్రవిషయాన అపనిందలాడంగ, కోపగించుకోని కుప్పమ్మ అపుడు
తానుతొందరగాను తనయింటికెళ్లి, లోధ్రకొంచము తెచ్చి లోటాలొ బోసి

కమలమ్మవద్దంటె కనికరంలేక, తాను బలవంతాన తాగించినాది
అదియేమిచిత్రమో ఆ దేవుడెఱుగు, దానిలాగుట్టేమొ ధన్వంతరెరుగు

పడకపై మెత్తంగ పడి గాగమెడుతూన్న, కమలమ్మ మొగమంత కళలుదేరింది
ఒక్కయదుటున లేచి పక్కపైనుండి, కౌగలించుకోని కుప్పమ్మనపుడు

ఏమిటేకుప్పమ్మ ఏటీమందేయిదీ, మన్నించవేతప్పు మరియిట్లగనసే
అనియిట్లువేడంగ అతిదీనముగనూ, కుప్పమ్మబిరబిరా చెప్పసాగింది

ఆసముద్రములోన అమృతంబుమల్లె, కేసరికుటీరమున పూనింది లోధ్ర
ఆడవారిబాధలన్ని పోగొట్టుటకు, ధన్వంతరేవచ్చి ధరనిలిపినాడు

లోధ్రపాండురకీర్తి లోకమంతానిండి, జనులకందరికినీ జ్యోతినిచ్చింది
ముట్టుకట్టులమాన్పి, పొట్టనొప్పులజీల్చి, నడుమునొప్పులగర్వ మడగించుతాది

ముట్టుసరిగారాక మొత్తుకుంటూఉన్న, ముదితలందరికీని మోదమిస్తాది.
అశ్వత్థవృక్షాల గిశ్వత్థవృక్షాల, చుట్టుచుట్టూ తిరిగి చీకాకుపొంగి

బిడ్డగిడ్డాలేక జేలర్వైయేడ్చేటి, ముసలికైనాయిచ్చు ముద్దుబిడ్డలను
గర్భకోశములోని గండాలుపోగొట్టి, సంతనమూనిచ్చు సౌభాగ్యమిచ్చు

ఎందుకింతాగొడవ ఎక్కువెందుకు కమల, దాన్నిమించినమందు ధాత్రిలోలేదు
అది స్త్రీలపాలిటీ ఆ కామధేనువే, అది స్త్రీలపాలిటీ ఆకల్పతరువే

ఇదివినీకమలమ్మ యింతవరకూదాన్ని, తాగనందుకుచాల వగచెంది తనలోన
ఇకముందునైనాను లోధ్రతాగాలనీ, ఘట్టిగా ఓ పెద్దఒట్టెట్టుకుంది.

''' ఈమందు అన్ని మందులషాపులలోను దొరకును. '''

# RAJA (TRADE MARK)

*Cosmetics*
*Perfumery*
*Soaps*



















**MANYAM & CO.,** *BANGALORE. MADRAS. MADURA. BOMB*

